





శ్రీరస్తు    శుభమస్తు    అవిఘ్నమస్తు

శ్రీ విళంబి నామ సంవత్సర

## శ్రీ గాయత్రి

# గంటల పంచాంగము

దృక్సిద్ధాంత ప్రామాణిక పంచాంగము

**2018-2019**






"దైవజ్ఞరత్న" సువర్ణ సింహ తలాట సన్మాన గ్రహీత

కారుపర్తి కోటేశ్వరరావు, సిద్ధాంతి

# శ్రీ గాయత్రి గంటల పంచాంగ ఆవిష్కరణ దృశ్యములు



శ్రీ పీఠం వ్యవస్థాపకులు పూజ్యశ్రీ పరిపూర్ణానంద సరస్వతి గారిచే
పంచాంగావిష్కరణ దృశ్యం



బర్ఫానీ బాబా గారిచే ఆశీర్వాదం తీసుకొంటున్న దృశ్యం

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు



# కారుపర్తి వారి
## శ్రీవిళంబి నామ సం॥ర దృక్సిద్ధాంత ప్రామాణిక గంటల పంచాంగము 2018-2019



శ్లో॥ ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణైః ।
రుక్తామిందు నిబద్ధ రత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం ।
గాయత్రీం వరదాభయాం కుశకశా శుభ్రం కపాలం గదాం ।
శంఖం చక్ర మదారవింద యుగళం హస్తైర్వహంతీం భజే ॥

శ్రీ విళంబి నామ సంవత్సరము అంతయూ అందరికీ జయప్రదముగాను, ఆయు ఆరోగ్య, భోగభాగ్యములు గాయత్రిమాత కలుగుచేయుగాక !



## పంచాంగ కర్త

"దైవజ్ఞరత్న", "సువర్ణ సింహ తలాట సన్మాన గ్రహీత"


# కారుపర్తి కోటేశ్వరరావు సిద్ధాంతి

పల్లాలమ్మ గుడి వీధి, జగ్గన్నపేట, పిన్ : 533 249
మామిడికుదురు మం., తూ.గో. జిల్లా

సెల్ : 98668 64383, రెసిడెన్స్ : 248949 (08862)

e-mail : mgastrologi@gmail.com

బ్రాంచి : విశాఖపట్టణం


వాస్తు, ముహూర్త, జాతక విషయములు చెప్పబడును.
వాస్తు, జాతక దోషములకు శాంతి యంత్రములు పూజించి ఇవ్వబడును.

# విషయసూచిక



## నవగ్రహ ధ్యాన శ్లోకములు

**1. రవి** : జపాకుసుమ సంకాశం కాస్యపేయం మహాద్యుతిమ్
తమోరిం సర్వ పాపఘ్నుం ప్రణతోస్మి దివాకరమ్ 6 వేలు
**ఓం హ్రాం, హ్రీం, హ్రౌం, సః సూర్యాయ నమః**

**2. చంద్ర** : దధిశంఖ తుషారాభం క్షీరోదార్నవ సముద్భవమ్
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం 10 వేలు
**ఓం శ్రాం, శ్రీం, శ్రౌం, సః చంద్రాయ నమః**

**3. కుజ** : ధరణీ గర్భసంభూతం విద్యుత్కాంతి సమప్రభమ్
కుమారం శక్తి హస్తం తం మంగళమ్ ప్రణమామ్యహమ్ 7 వేలు
**ఓం క్రాం, క్రీం, క్రౌం, సః భౌమాయ నమః**

**4. బుధ** : ప్రియంగు కలికాశ్యామం రూపేణా ప్రతిమం బుధమ్
సౌమ్యం సౌమ్య గుణోపేతం తం బుధం ప్రణమామ్యహమ్ 17 వేలు
**ఓం బ్రాం, బ్రీం, బ్రౌం, సః బుధాయ నమః**

**5. గురు** : దేవానాంచ ఋషీణాంచ గురుం కాంచన సన్నిభమ్
బుద్ధిమంతం త్రిలోకేశం తం నమామి బృహస్పతిమ్ 16 వేలు
**ఓం హ్రాం, హ్రీం, హ్రౌం, సః బృహస్పతయే నమః**

**6. శుక్ర** : హిమకుంద మృణాళాభం దైత్యానాం పరమం గురుమ్
సర్వశాస్త్ర ప్రవక్తారం భార్గం ప్రణమామ్యహమ్ 20 వేలు
**ఓం ద్రాం, ద్రీం, ద్రౌం, సః శుక్రాయ నమః**

**7. శని** : నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజమ్
ఛాయా మార్తాండ సంభూతం తం నమామి శనైశ్చరమ్ 19 వేలు
**ఓం ఖ్రాం, ఖ్రీం, ఖ్రౌం, సః శనయే నమః**

**8. రాహు** : అర్థకాయం మహావీరం చంద్రాదిత్య విమర్ధనమ్
సింహికాగర్భ సంభూతం తం రాహుం ప్రణమామ్యహమ్ 18 వేలు
**ఓం భ్రాం, భ్రీం, భ్రౌం సః రాహవే నమః**

**9. కేతు** : ఫలాశ పుష్పసంకాశం తారకా గ్రహమస్తకమ్
రౌద్రం రౌద్రాత్మకం ఘోరం తంకేతుం ప్రణమామ్యహమ్ 7 వేలు
**ఓం ప్రాం, ప్రీం, ప్రౌం సః కేతవే నమః**

**ఈ శ్లోకములు పఠించుట వలన గ్రహదోషములు నివారణ అయి మానసిక ప్రశాంతత చేకూరి దుఃఖ, ఈతిబాధల నివారణ తప్పక కల్గును.**

# శ్రీ దత్తాత్రేయ స్తోత్రం



జటాధరం పాండరంగం శూలహస్తం కృపానిధిం ।
సర్వరోగహరం దేవం దత్తాత్రేయమహం భజే ॥
జగదుత్పత్తికర్త్రే చ స్థితిసంహారహేతవే ।
భవపాశవిముక్తాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥1॥
జరాజన్మ వినాశాయ దేహశుద్ధికరాయ చ ।
దిగంబరదయామూర్తే దత్తాత్రేయ నమోఽస్తుతే ॥2॥
కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తిధరాయ చ ।
వేదశాస్త్రపరిజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥3॥
హ్రస్వదీర్ఘకృశస్థూలనామగోత్రవివర్జిత ।
పంచభూతైకదీప్తాయ దత్తాత్రేయ నమో స్తుతే ॥4॥
యజ్ఞభోక్తే చ యజ్ఞాయ యజ్ఞరూపధరాయ చ ।
యజ్ఞప్రియాయ సిద్ధాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥5॥
ఆదౌ బ్రహ్మ మధ్యే విష్ణుః అంతే దేవః సదాశివః ।
మూర్తిత్రయస్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥6॥
భోగాలయాయ భోగాయ యోగయోగ్యాయ ధారిణే ।
జితేంద్రియజితజ్ఞాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥7॥
దిగంబరాయ దివ్యాయ దివ్యరూప ధరాయ చ ।
సదోదితపరబ్రహ్మ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥8॥
జంబుద్వీపే మహాక్షేత్రే మాతాపురనివాసినే ।
జయమానసతాం దేవ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥9॥
భిక్షాటనం గృహే గ్రామే పాత్రం హేమమయం కరే ।
నానాస్వాదమయీ భిక్షా దత్తాత్రేయ నమోఽస్తుతే ॥10॥
బ్రహ్మజ్ఞానమయీ ముద్రా వస్త్రే చాకాశభూతలే ।
ప్రజ్ఞానఘనబోధాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥11॥
అవధూతసదానందపరబ్రహ్మస్వరూపిణే ।
విదేహదేహరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥12॥
సత్యరూపసదాచారసత్యధర్మపరాయణ ।
యజ్ఞసూత్రధరబ్రహ్మన్ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥13॥
శూలహస్తగదాపాణే వనమాలాసుకంధర ।
యజ్ఞసూత్రధరబ్రహ్మన్ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥14॥
క్షరాక్షరస్వరూపాయ పరాత్పరతరాయ చ ।
దత్తముక్తిపరస్తోత్ర దత్తాత్రేయ నమోఽస్తుతే ॥15॥
దత్త విద్యాఢ్యలక్ష్మీశ దత్త స్వాత్మస్వరూపిణే ।
గుణనిర్గుణరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే ॥16॥
శత్రునాశకరం స్తోత్రం జ్ఞానవిజ్ఞానదాయకమ్ ।
సర్వపాపం శమం యాతి దత్తాత్రేయ నమోఽస్తుతే ॥17॥
ఇదం స్తోత్రం మహద్దివ్యం దత్తప్రత్యక్షకారకమ్ ।
దత్తాత్రేయప్రసాదాచ్చ నారదేన ప్రకీర్తితమ్ ॥18॥

# గాయత్రీ కవచము



ఓం అస్యైకం పరమం గుహ్యం గాయత్రీ కవచం తథా
పఠనాద్ధారణాన్మర్త్య స్సర్వపాపైః ప్రముచ్యతే॥ 1
ఓం సర్వాన్కామానవాప్నోతి దేవీ రూపశ్చజాయతే
గాయత్రీ కవచస్యాస్య బ్రహ్మ విష్ణు మహేశ్వరాః॥ 2
ఋషయో ఋగ్యజు స్సామాథర్వా శ్ఛందాంసి నారద
బ్రహ్మరూపాదేవతోక్తా గాయత్రీ పరమాకళా॥ 3
తద్బీజం భర్గ ఇత్యేషా శక్తిరుక్తామనీషిభిః
కీలకంచ ధియః ప్రోక్తం మోక్షార్థే వినియోజనమ్॥ 4
చతుర్భిర్హృదయం ప్రోక్తం చతుర్భిస్తు శిరః స్మృతం
పంచభిస్స్యాచ్ఛిఖా పశ్చాత్త్రిభిస్తు కవచం స్మృతం॥ 5
చతుర్భిర్నేత్ర ముద్దిష్టం చతుర్భిస్యాత్త దస్త్రకం
అథధ్యానం ప్రవక్ష్యామి సాధకాభీష్ట దాయకం॥ 6
ఓం ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖైస్త్రీక్షణైః
యుక్త్యామిందునిబద్ధ రత్నమకుటాం తత్వార్థ వర్ణాత్మికామ్
గాయత్రీం వరదాభయాంకుశ కశాశ్శూలం కపాలం గదాం
శంఖం చక్రమథారవింద యుగళం హస్తైర్వహంతీం భజే ॥ 7
గాయత్రీ పూర్వతః పాతు సావిత్రీ పాతు దక్షిణే
బ్రహ్మసంధ్యాతుమే పశ్చాత్ ఉత్తరస్యాం సరస్వతీ॥ 8
పార్వతీమే దిశం రక్షేత్పావకీం జలశాయినీ
యాతుధానీ దిశం రక్షాత్ యాతుధాన భయంకరీ॥ 9
పావమానీం దిశం రక్షే త్పవమాన విలాసినీ
దిశం రౌద్రీంచ మే పాతు రుద్రాణీ రుద్రరూపిణీ॥ 10
బ్రహ్మాణార్ధ్వంతు మే రక్షే దధస్తాత్ వైష్ణవీసదా
ఏవం దశదిశో రక్షేత్ సర్వాంగం భువేశ్వరీ॥ 11
ఓం తత్పదం పాతుమే పాదౌ జంఘేమే సవితుః పదమ్
వరేణ్యం కటి దేశంతు నాభింభర్గ స్తథైవచ॥ 12
దేవస్యమే తత్ హృదయం ధీమహీతిచమే గళం
ధియః పదంచ మే నేత్రేయః పదంమే లలాటకం॥ 13
నః పాతుమే పదం మూర్ని శిఖాయాంమే ప్రచోదయాత్
తద్వర్ణః పాతు మూర్ధానం నకారః పాతు ఫాలకం॥ 14
చక్షుఃపాతు వికారార్ణః తుకారస్తు కపోలయోః
నాసాపుటం వకారార్ణో రేకారస్తు ముఖంతథా॥ 15

ణికార ఊర్ధ్వం ఓష్ఠం యకార స్త్వధరోష్టకం
ఆస్యమధ్యే భకారార్ణో గోవరశ్చుబుకంతథా॥ 16
దేకారః కంఠదేశేతు వకారః స్కంధదేశకమ్
స్యకారో దక్షిణం హస్తం ధీకారో వామహస్తకం॥ 17
మకారో హృదయం రక్షొద్ధికార ఉదరేతథా
ధికారో నాభిదేశేతు యోకారస్తు కటింతథా॥ 18
గుహ్యంరక్షతు యోకార ఊరూద్వేనః పదాక్షరం
ప్రకారోజానునీ రక్షేచ్ఛోకారో జంఘదేశకం॥ 19
దకారోగుల్ఫ దేశంతు యాకారః పదయుగ్మకం
తకారవ్యంజనంచైవ సర్వాంగంమే సదావతు॥ 20
ఇదంతు కవచం దివ్యం బాధాశత వినాశనం
చతుష్షష్టి కళావిద్యాదాయకం మోక్షకారకం ॥ 21
ముచ్యతే సర్వపాపేభ్యః పరం బ్రహ్మాధిగచ్ఛతి
పఠనా చ్ఛ్రవణాద్వాపి గోసహస్ర ఫలంలభేత్ ॥ 22

**(ఇతి శ్రీదేవి భాగవతే ద్వాదశ స్కందే గాయత్రీ మంత్ర కవచమ్ సంపూర్ణమ్)**

## నీలుడు చేసిన ఆంజనేయ స్తోత్రం



ఓం జయ జయ - శ్రీ ఆంజనేయ
కేసరీ ప్రియ నందన - వాయు కుమారా
ఈశ్వర పుత్ర - పార్వతీ గర్భ సంభూత
వానర నాయక - సకల వేద శాస్త్ర పారంగ
సంజీవి పర్వతోత్పాటన - లక్ష్మణ ప్రాణ రక్షక
గుహ ప్రాణ దాయక - సీతా దుఃఖ నివారణ
ధాన్య మాలీ శాప విమోచన - దుర్దండీ బంధ విమోచన
నీల మేఘ రాజ్య దాయక - సుగ్రీవ రాజ్య దాయక
భీమసేనాగ్రజ ధనుంజయ ధ్వజ వాహన
కాల నేమి సంహార మైరావణ మర్దన - వృత్రాసుర భంజన
సప్త మంత్రి సుత ధ్వంసన - ఇంద్రజిత్ వధ కారణ
అక్ష కుమార సంహార - లంఖిణీ భంజన
రావణ మర్దన - కుంభకర్ణ వధ పరాయణ
జంబు మాలి నిష్టుదన వాలి నిబర్హన
రాక్షస కుల దహన అశోక వణ విదారణ
లంకా దహక - శత ముఖ వధ కారణ
సప్త సాగర వాల సేతు బంధన
నిరాకార నిర్గుణ సగుణ స్వరూపా

హేమ వర్ణ పీతాంబర ధార - సువర్చలా ప్రాణ నాయక
త్రయ త్రిమ్శాత్కోటిఅర్బుద రుద్ర గణ పోషణ
భక్త పాలన చతుర - కనక కుండలాభరణ
రత్న కిరీట హార నూపుర శోభిత
రామ భక్తి తత్పర - హేమ రంభావన విహార
వక్షతాంకిత మేఘ వాహక - నీల మేఘ శ్యామ
సూక్ష్మ కాయ - మహా కాయ - బాల సూర్య గ్రసన
ఋష్యమూక గిరి నివాసక - మేరు పీతకార్చన
ద్వాత్రిమ్శాదాయుధ ధర - చిత్ర వర్ణ - విచిత్ర సృష్టి నిర్మాణ కర్త
అనంత నామ - దశావతార - అఘటన ఘటనా సమర్ధ
అనంత బ్రహ్మాన్ - నాయక - దుర్జన సంహార
సుజన రక్షక - దేవేంద్ర వందిత - సకల లోకారాధ్య
సత్య సంకల్ప - భక్త సంకల్ప పూరక
అతి సుకుమార దేహ - ఆకర్దమ వినోద లేపన
కోటి మన్మధాకార - రణ కేళి మర్దన
విజ్రుమ్భ మాణ - సకల లోక కుక్షిమ్భర
సప్త కోటి మహా మంత్ర తంత్ర స్వరూప
భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ విధ్వంసన
శివలింగా ప్రతిష్టాపన కారణ - దుష్కర్మ విమోచన
దౌర్భాగ్య నాశన - జ్వరాది సకల లోప హర
భుక్తి ముక్తి దాయక - కపట నాటక సూత్రా దారీ
తలావినోదాంకిత - కళ్యాణ పరిపూర్ణ - మంగళ ప్రద
గాన ప్రియ - అష్టాంగా యోగ నిపుణ
సకల విద్యా పారీణ - ఆది మధ్యంత రహిత
యజ్ఞ కర్త - యజ్ఞ భోక్త - శన్మత వైభవ సానుభూతి చతుర
సకల లోకాతీత - విశ్వంభర
విశ్వ మూర్తే - విశ్వాకార - దయాస్వరూప
దాసజన హృదయ కమల విహార - మనోవేగ గమన
భావజ్ఞ నిపుణ - రుషి గణ గేయ
భక్త మనోరద దాయక - భక్త వత్సల
దీన పోషక - దీన మందార - సర్వ స్వతంత్ర
శరణాగత రక్షక - ఆర్త త్రాణ పరాయణ
ఏక అసహాయ వీర - హనుమాన్
విజయీ భవ - దిగ్విజయీ భవ

# కార్తీక పౌర్ణమి శ్లోకం

'కార్తీక' మాసం సంవత్సరంలోని సర్వమాసాలకంటే మహిమాన్వితమైనది. కార్తీక మాసం నెలరోజులూ రోజూ సాయం సంధ్య వేళ పూజా స్థలములో, తులసి కోటవద్ద, ఇంటిముందు దీపాలను వెలిగించి నమస్కరించే ఆచారం మన హిందువులకు అనాదిగా వస్తున్నది. రోజూ కుదరకపోయినా కార్తీక పూర్ణిమ నాడు తప్పక వెలిగిస్తారు. అలా వెలిగించిన దీపంలో దామోదరుని ఆవాహన చేసి, ఈ క్రింది శ్లోకాన్ని చెప్పి ప్రార్థన చేయాలి.



**కీటాఃపతంగాః మశకా శ్చ వృక్షాః**
**జలేస్థలే.....ఫలే ఏ నివసంతి**
**జీవా దృష్ట్వా ప్రదీపం నచ జన్మ భాగినః**
**భవతింత్వ స్వపచాహి విప్రాః**

చీమలు, ఈగలు, దోమలు, పురుగులు, వృక్షాలు, జలచరాలు, భూచరాలు ఒకటేమిటి ఈ భూమిమీద నివసించే ప్రతీ ఒక్కజీవికీ కూడా ఈ దీపం వెలుతురుని దర్శించగానే ఇక మరుజన్మ అంటూ లేని అనంత పుణ్యాన్ని పొందాలి.

కార్తీక మాసమంతా స్నానం, దానం ఉపవాసం చేసే శక్తిలేని వారు కనీసం ఒక్క కార్తీక పౌర్ణమినాడైన వీటిని ఆచరిస్తే కార్తీక పుణ్యఫలం లభిస్తుందని శాస్త్రోక్తి. ఈ మాసంలో ఉపవాసం పాటించేవారు ఏక భుక్తం, నక్తభోజనం చేస్తారు. నక్తం ఉండలేనివారు ఒక కార్తీక పౌర్ణమినాడు లేదా కార్తీక సోమవారాలు నక్తములున్నా పుణ్యప్రదమే. కార్తీక పౌర్ణమినాడు సత్ బ్రాహ్మణుని ఆహ్వానించి భోజనం పెట్టి దీప దానం చేస్తూ

**"సర్వజ్ఞాన ప్రదం దీపం సర్వ సంపచ్ఛుభావహం !**
**దీపదానం ప్రదాస్యామి శాంతిరస్తు సదా మమ"**

అనే శ్లోకం పఠించాలి.

'దీపం జ్యోతి పరబ్రహ్మః" దీపం జ్ఞానానికి ప్రతీక, ఈ దీపదానం వలన జ్ఞానం, ఆయుఃవృద్ధి, విద్య, సకల భోగాలు కలుగుతాయని శాస్త్రం. ఈ దీపదానం కార్తీక మాసంలో అన్నిటికంటే ప్రధానమైనది. ఎవరైతే దీపదానం చేస్తారో వారి వారి పాపాలన్నీ నశించిపోతాయని వశిష్ఠవచనం.

ఒక వత్తితో దీపదానం సద్బుద్ధిని, తేజస్సుని ఇస్తుంది. నాలుగు వత్తుల దీపదానం రాజ సమానులను చేస్తుంది. పదివత్తుల దీపదానం రాజకీయ సిద్ధినిస్తుంది. ఏబది వత్తుల దీపదానం దేవత్వాన్నిస్తుంది. వెయ్యి వత్తుల దీపదానం ఈశ్వర కృపకు పాత్రుల్ని చేస్తుంది. వెండి, ప్రమీదలో పైడిపత్తి వత్తులు వేసి, ఆవు నేతితో వెలిగించిన దీపాన్ని దానం చేయడంవల్ల వచ్చే పుణ్యం అనంత మైనదిగా, వెండి ప్రమిదలో బంగారు వత్తులు వేసి, దానం చేస్తే జన్మరాహిత్యం పొందుతారని మన పురాణాలు తెల్పుతున్నాయి.

## ఏ నక్షత్రం వారు ఆ నక్షత్ర గాయత్రి పఠించాలి

(రోజుకు 9 సార్లు)

1. అశ్విని
ఓం శ్వేతవర్ణైవిద్మహే సుధాకరాయై ధీమహి తన్నో అశ్వినేన ప్రచోదయాత్

2. భరణి
ఓం కృష్ణవర్ణై విద్మహై దండధరాయై ధీమహి తన్నో భరణిః ప్రచోదయాత్

3. కృత్తిక
ఓం వహ్ణిదేహాయై విద్మహే మహాతపాయై ధీమహి తన్నో కృత్తికా ప్రచోదయాత్

4. రోహిణి
ప్రజావిరుద్ధైచ విద్మహే విశ్వరూపాయై ధీమహి తన్నో రోహిణి ప్రచోదయాత్

5. మృగశిర
ఓం శశిశేఖరాయ విద్మహే మహారాజాయ ధీమహి తన్నో మృగశిరః ప్రచోదయాత్

6. ఆరుద్ర
ఓం మహాశ్రేష్ఠాయ విద్మహే పశుం తనాయ ధీమహి తన్నో ఆర్ద్రా ప్రచోదయాత్

7. పునర్వసు
ఓం ప్రజా వరుద్ధైచ విద్మహే అదితి పుత్రాయ ధీమహి తన్నో పునర్వసు ప్రచోదయాత్

8. పుష్యమి
ఓం బ్రహ్మవర్చసాయ విద్మహే మహాదిశాయాయ ధీమహి తన్నో పుష్యఃప్రచోదయాత్

9. ఆశ్లేష
ఓం సర్పరాజాయ విద్మహే మహారోచకాయ ధీమహి తన్నో ఆశ్లేషః ప్రచోదయాత్

10. మఖ
ఓం మహా అనగాయ విద్మహే పిత్రియాదేవాయ ధీమహి తన్నో మఖః ప్రచోదయాత్

11. పుబ్బ
ఓం అరియంనాయ విద్మహే పశుదేహాయ ధీమహి తన్నో పూర్వఫల్గుణి ప్రచోదయాత్

12. ఉత్తర
మహాబకాయై విద్మహే మహాశ్రేష్ఠాయై ధీమహి తన్నో ఉత్తర ఫల్గుణి ప్రచోదయాత్

13. హస్త
ఓం ప్రయచ్ఛతాయై విద్మహే ప్రకృప్రణీతాయై ధీమహి తన్నో హస్తా ప్రచోదయాత్

14. చిత్త
ఓం మహాదృష్టాయై విద్మహే ప్రజారపాయై ధీమహి తన్నో చైత్రాః ప్రచోదయాత్

15. స్వాతి
ఓం కామసారాయై విద్మహే మహానిష్ఠాయై ధీమహి తన్నో స్వాతి ప్రచోదయాత్

16. విశాఖ
ఓం ఇంద్రాగ్నేస్యై విద్మహే మహాశ్రేష్ఠాయై చ ధీమహీ తన్నో విశాఖ ప్రచోదయాత్

17. అనూరాధ
ఓం మిత్రదేయాయై విద్మహే మహామిత్రాయ ధీమహి తన్నో అనూరాధా ప్రచోదయాత్

18. జ్యేష్ఠ
ఓం జ్యేష్ఠాయై విద్మహే మహాజ్యేష్ఠాయై ధీమహి తన్నో జ్యేష్ఠా ప్రచోదయాత్

**19. మూల**

ఓం ప్రజాధిపాయై విద్మహే మహాప్రజాధిపాయై ధీమహి తన్నో మూలా ప్రచోదయాత్

**20. పూర్వాషాడ**

ఓం సముద్రకామాయై విద్మహే మహాబీజితాయై ధీమహి తన్నో పూర్వాషాఢా ప్రచోదయాత్

**21. ఉత్తరాషాడ**

ఓం విశ్వేదేవాయ విద్మహే మహాషాడాయ ధిమహి తన్నో ఉత్తరాషాడా ప్రచోదయాత్

**22. శ్రవణ**

ఓం మహాశ్రేష్ఠాయై విద్మహే పుణ్యశ్లోకాయ ధీమహి తన్నో శ్రవణ ప్రచోదయాత్

**23. ధనిష్ఠ**

ఓం అగ్రనాథాయ విద్మహే వసూప్రీతాయ ధీమహి తన్నో శర్విష్ఠా ప్రచోదయాత్

**24. శతభిషం**

ఓం భేషజాయ విద్మహే వరుణదేహాయ ధీమహి తన్నో శతభిషా ప్రచోదయాత్

**25. పూర్వాభాద్ర**

ఓం తేజస్కరాయ విద్మహే అజరక పాదాయ ధీమహి తన్నో పూర్వప్రోష్ఠపత ప్రచోదయాత్

**26. ఉత్తరాభాద్ర**

ఓం అహిరబుధ్నాయ విద్మహే ప్రతిష్ఠాపనాయ ధీమహి తన్నో ఉత్తరప్రోష్ఠపత ప్రచోదయాత్

**27. రేవతి**

ఓం విశ్వరూపాయ విద్మహే పూష్ణ దేహాయ తన్నో రేవతి ప్రచోదయాత్

## షోడశ గణపతులు



విఘ్నాధిపతి అయిన వినాయకుడిని 16 రూపాల్లో తాంత్రికులు పూజిస్తుంటారు. నిజానికి వినాయకుడికి 32 రూపాలున్నాయనీ, వీటిలో 16 మాత్రం అత్యంత ప్రముఖమైనవని చెబుతారు. ఈ 16 రూపాలలో ఒక్కో రూపానిదీ ఒక్కో విశిష్టత. ఆ రూపాలేంటో, వాటి విశిష్టతలేంటో తెలుసుకుందాం.

**1. బాల గణపతి :**

ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతులుంటాయి. కుడి వైపు చేతులలో అరటిపండు, పనసతొన, ఎడమవైపు ఉన్న చేతులతో మామిడిపండు, చెరకుగడని పట్టుకుని దర్శనమిస్తారు. బుద్ధి చురుకుగా పనిచేయాలంటే ఈ బాల గణపతిని పూజించాలి.

**కరస్థ గదలీ చూత పన పేక్షుక మోదకమ్ ।**
**బాలసూర్య నిభం వందే దేవం బాలగణాధిపమ్ ॥**

అనే మంత్రంతో ప్రతిరోజు సూర్యోదయ సమయాన చదవాలి.

**2. తరుణ గణపతి :**

ఈ వినాయకుడి రూపానికి ఎనిమిది చేతులుంటాయి కుడి వైపు చేతులతో పాశం, వెలగగుజ్జు, దంతం, చెరకు ఎడమవైపు ఉన్న చేతులతో అంకుశం, నేరేడు పండు, వరివెన్ను పట్టుకుని అభయముద్రతో దర్శనమిస్తారు. ఈయనను....

పాశాంకశాపూస కపిత్థ జంబూ స్వదంత శాలీనమపి స్వహస్తైః ధత్తే ।
సదా య సతరుణాభః పాయాత్స యుష్మాం స్తరుణో గణేశః ॥

అనే మంత్రంతో పూజించాలి.

### 3. భక్త గణపతి :

ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతులుంటాయి కుడివైపు చేతులలో కొబ్బరికాయ, అరటిపండు ఎడమవైపు ఉన్న చేతులలో మామిడి పండు, బెల్లపు పరమాన్నం ఉన్న పాత్ర పట్టుకుని కనిపిస్తారు. ఈయనను........

నాలికేరామ్ర కదలీ గుడపాయాస ధారిణమ్ ।
శరచ్చంద్రాభ్వవుషం భజే భక్త గణాధిపమ్ ॥

ఆనే మంత్రంతో స్తుతించాలి........ఈయనను సేవిస్తే భక్తిభావం పెరుగుతుంది.

### 4. వీరగణపతి :

ఈ వినాయకుడి రూపానికి పదహారు చేతులుంటాయి కుడివైపు చేతులతో బాణం, బేతాలుడు, చక్రం, మంచపుకోడు, గద, పాము, శూలం, గొడ్డలిబొమ్మ ఉన్న జెండా, ఎడమవైపు ఉన్న చేతులతో శక్తి అనే ఆయుధం, విల్లు, ఖడ్గం, ముద్గరమనే ఆయుధం, అంకుశం, పాశం, కుంతమనే ఆయుధం, దంతం ధరించి దర్శనమిస్తారు. ఈయనను ......

బేతాల శక్తి శర కార్ముక చక్ర ఖడ్గ ఖట్వాంగ ముద్గర గదాంకుశ నాగపాశాన్।
శూలంచకుంత పరశుధ్వజ మాత్తదంతం వీరం గణేశ మరుణం త్వనిశం స్మరామి॥

అనే మంత్రంతో కీర్తించాలి. ఈయనను పూజించిన భక్తులకు తిరుగులేని ధైర్యం ప్రసాదిస్తారు.

### 5. శక్తి గణపతి :

ఆలింగ్య దేవీం హరితాంగయష్టిం పరస్పరా శ్లిష్ట కటిప్రదేశమ్ ।
సంధ్యారుణం పాశ స్పటీర్ధధానం భయాపహం శక్తి గణేశ మీదే ॥

అనే మంత్రంతో ఈ గణేశుని ప్రార్థించాలి. నాలుగు చేతులున్న ఈ గణపతి అంకుశం, పాశం, విరిగిన దంతం పట్టుకుని దర్శనమిస్తారు. ఈయన కరుణిస్తే ఏదయినా సాధించగలమనే ఆత్మస్థైర్యం పెరుగుతుంది.

### 6. ద్విజ గణపతి :

ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతులుంటాయి కుడి వైపు చేతులతో పుస్తకం, దండం ఎడమవైపు ఉన్న చేతులతో అక్షమాల, కమండలం పట్టుకుని కనిపిస్తారు. ఈయనను...

యం పుస్తకాక్ష గుణదండ కమండలు శ్రీః । విద్యోతమాన కరభూషణ మిందువర్ణమ్।
స్తంబేరమానవ చతుష్టయ శోభమానం। త్వాం ద్విజగణపతే సిద్ధ్విజ గణాధిపతే స ధన్యః॥

అనే మంత్రంతో పూజించాలి. ఈ గణపతి తెలివి తేటలు ప్రసాదిస్తాడు.

### 7. సిద్ధి (పింగల) గణపతి :

ఈ గణపతిని సేవిస్తే ప్రారంభించిన పనులలో అపజయమన్నది ఉండదు. ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతులుంటాయి. కుడివైపు చేతులతో పండిన మామిడిపండు, ఎడమవైపు ఉన్న చేతులతో పూలగుత్తి, గొడ్డలి పట్టుకుని కనిపిస్తారు. ఈయనను.....

పక్వచుత ఫల పుష్పమంజరీ । ఇక్షుదండ తిలమోదకై స్సహా ।
ఉద్వహన్ పరశుమస్తు తే నమః । శ్రీ సమృద్ధియుత హేమం పింగల ॥
అనే మంత్రంతో స్తుతించాలి.

**8. ఉచ్ఛిష్ట గణపతి :**

కోరిన కోర్కెలు తీర్చే ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతులుంటాయి. కుడి వైపు చేతులతో నల్ల కలువ, వరివెన్ను ఎడమ వైపు ఉన్న చేతులతో దానిమ్మపండు, జపమాల పట్టుకుని కనిపిస్తారు. ఈయనను..........

నీలబ్జ దాడిమీ వీణా శాలినీ గుంజాక్ష సూత్రకమ్ ।
దధదుచ్ఛిష్ట నామాయం గణేశః పాతు మేచకః ॥
అనే మంత్రంతో ప్రార్థించాలి.

**9. విఘ్న గణపతి :**

గణపతి అసలు లక్షణమైన విఘ్ననాశనం ఈ రూపంలో కనిపిస్తుంది. ఈ వినాయకుడి రూపానికి పది చేతులుంటాయి. కుడివైపు చేతులతో శంఖం, విల్లు, గొడ్డలి, చక్రం, పూలగుత్తి, ఎడమవైపు ఉన్న చేతులతో చెరకు, పూలబాణం, పాశం, విరిగిన దంతం, బాణాలు పట్టుకుని కనిపిస్తారు. ఈయనను...

శంఖేక్షు చాప కుసుమేషు కుఠార పాశ । చక్ర స్వదంత సృణి మంజిరికా శరౌఘైః।
పాణిశ్రిఉ పరిసమీహిత భూషణా। శ్రీ విఘ్నేశ్వరో విజయతే తపనీయ గౌరః॥
అనే మంత్రంతో ప్రార్థించాలి.

**10. క్షిప్ర గణపతి :**

ఈ వినాయకుడి రూపానికి నాలుగు చేతలుంటాయి కుడి వైపు చేతులలో దంతం, రత్నాలు పొదిగిన బంగారు కుండ ఎడమవైపు ఉన్న చేతులతో కల్పవృక్షపు తీగ, అంకుశం ధరించి కనిపిస్తారు. ఈయనను.........

దంత కల్పలతా పాశరత్న కుంభాంకుశోజ్జ్వలమ్ ।
బంధూక కమనీయాభం ధ్యాయేత్ క్షిప్ర గణాధిపమ్ ॥
ఆనే మంత్రంతో స్తుతించాలి.

**11. హేరంబ గణపతి**

అభయ వరదహస్త పాశదంతామాల క్షసృణి । పరశు రధానే ముద్గరం మోదకాపీ।
ఫలమధిగత సింహ పంచమాతంగా వక్త్రం। గణపతి రతిగౌరః పాతు హేరంబనామా॥

అనే మంత్రంతో స్తుతించవలసిన ఈ వినాయకుడి రూపానికి పది చేతులుంటాయి కుడి వైపు చేతితో అభయముద్రనిస్తూ, కత్తి, అక్షమాల, గొడ్డలి, మోదకం ధరించి, ఎడమవైపు ఉన్న చేతులతో వరద హస్త ముద్రతో విరిగిన దంతం, అంకుశం, ముద్గరం, పాశం ధరించి కనిపిస్తారు. ఈయనను సేవిస్తే ప్రయాణాలలో ఆపదలను నివారిస్తారు.

**12. లక్ష్మీ గణపతి :**

బిభ్రాణ శ్శుకబీజపూరక మిలన్మాణిక్య కుంబంకుశన్
పాశం కల్పలతాం చ ఖడ్గ విలసజ్జ్యోతి స్సుదా నిర్ఘరః
శ్యామేనాత్తసరోరు హేణ సహితం దేవీద్వయం చాంతికే.
గౌరాంగో వరదాన హస్త సహితో లక్ష్మీ గణేశోశావ తాత్ ॥

అనే స్తోత్రంతో పూజించవలసిన ఈ వినాయకుడి రూపానికి 10 చేతులు ఉంటాయి. కుడివైపు చేతిలో వరదముద్రనిస్తూ, కత్తి, చిలుక, మాణిక్యం పొదిగిన కుంభం, పాశం, ఖడ్గం ధరించి, ఎడమవైపు ఉన్న చేతులతో అభయ హస్త ముద్రతో దానిమ్మ, అంకుశం, కల్పలత, అమృతం ధరించి కనిపిస్తారు. ఈయనను సేవిస్తే ఐశ్వర్యం కలుగుతుంది.

**13. మహాగణపతి :**

ఈ వినాయకుడి రూపానికి పది చేతుంటాయి కుడివైపు చేతులతో మొక్కజొన్న కండె, బాణం తొడిగిన విల్లు, పద్మం, కలువ, విరిగిన దంతం ధరించి, ఎడమ వైపు ఉన్న చేతులతో గద, చక్రం, పాశం, వరికంకె, రత్నాలు పొదిగిన కలశం ధరించి కనిపిస్తారు. ఈ గణపతిని సేవిస్తే సమస్త శుభాలు కలుగుతాయి.

**హస్తీంద్రావన చంద్రచూడ మరుణచ్ఛాయం ।**
**త్రినేత్రం రసాదాశ్లిష్టం శిరయమాస పద్మకరయా స్వాంకస్థయా సంతతమ్ ।**
**బీజాపూరగదా ధనుర్విద్య శిఖయుక్ చక్రాబ్జ పాశోత్పల ।**
**వీహ్యాగ్ర స్వవిశాణ రత్న కలశాన్ హస్తైర్వహంతం భజే ॥**

అనే మంత్రంతో ప్రార్థించాలి.

**14. విజయ గణపతి**

సమస్త విజయాలను చేకూర్చే ఈ గణపతి రూపానికి నాలుగు చేతులుంటాయి కుడి వైపు చేతులతో పాశం, విరిగిన దంతం ధరించి, ఎడమ వైపు ఉన్న చేతులతో అంకుశం, పండిన మామిడి పండు ధరించి కనిపిస్తారు. ఈ గణపతిని...............

**పాశాంకుశ స్వదంత్రాను ఫలావా నాఖు వాహనః**
**విఘ్నం నిఘ్నంతు నమః స్సర్వం రక్తవర్ణో వినాయకః**

అనే మంత్రంతో పూజించాలి.

**15. నృత్య గణపతి**

సంతృప్తిని, మనశ్శాంతినీ ఇచ్చే ఈ గణపతి కుడి చేతులలో పాశం, అప్పాలు, ఎడమ వైపు చేతులతో అంకుశం, పదునుగా ఉన్న విరిగిన దంతం ధరించి దర్శనమిస్తారు.

**పాశాంకుశాపూస కుఠారదంతః చంచత్కరః క్లుప్త పరాంగులీకమ్**
**పీతప్రభం కల్పతరో రథః స్థం భజామి తం నృత్త పదం గణేశమ్ ॥**

అనే మంత్రంతో ఈ వినాయకుడిని స్తుతించాలి.

**16. ఊర్ధ్వ గణపతి**

కారాగార బాధ నుండి తప్పించే ఈ గణపతి కుడిచేతులలో కలువ, పద్మం, విల్లు, విరిగిన దంతం, ఎడమ వైపు చేతులతో వరివెన్ను, చెరకుముక్క, బాణం, మొక్కజొన్న కండె ధరించి దర్శనమిస్తారు.

**కల్హార శాలి కమలేక్షుక చాపదంతా**
**ప్రరోహ కనకోజ్జ్వల లాలితాంగ ఆలింగ్య**
**గణోద్యతకరో హరితాంగ యష్ట్యా దేవ్యా**
**కరోతు శుభమూర్ధ్వ గణాదిపో మేః ॥**

అనే మంత్రంతో ఈ వినాయకుడిని స్తుతించాలి.

## శనిదోష పరిహారములు



శని పేరు చెప్పగానే ప్రజల మనస్సులలో ఒక విధమైన భయం. కానీ శని న్యాయమూర్తిలా వ్యవహరించి చెడు మార్గాన వెళ్ళే వ్యక్తిని దండించి సరియైన పంధాన నడిచే దారి చూపిస్తాడు సరియైన సమయంలో మంచి దెబ్బ కొట్టి వారిని చైతన్యవంతులను జేసి తిరిగి తప్పులు చేయకుండా ప్రత్యక్షంగా హెచ్చరి స్తాడు. శని వేసే శిక్షల వల్ల గాయంపైకి కనిపించిన ఆ వ్యక్తిలో మార్పు స్పష్టంగా దర్శనమిస్తుంది. శని గోదారక్రమంలో రాశిచక్రాన్ని చుట్టి వచ్చుటకు ముప్పై సంవత్సరములు పడుతుంది. శని గ్రహము తన కక్ష్యలో పరిభ్రమణము చేస్తూన్నప్పుడు ఒక్కొక్క రాశిలో రెండున్నరసంవత్సరముల చొప్పున పన్నెండు రాశు లలో 30 సంవత్సరములు పడుతుంది. ఆకారంలో శనిగ్రహం గురుగ్రహం కంటే చిన్నగ్రహం. శని సంచారం గోచారంలో చాలా నెమ్మదిగా ఉంటుంది. మిగతా గ్రహాలకంటే ఎక్కువ కాలం రాశిలో సంచరిస్తాడు కాబట్టి మానవుని జీవితంపై శని ప్రభావం అత్యధికంగా కనిపిస్తుంది. శని సుమారు 135 రోజుల వరకు సామాన్యవేగంతో సంచరించిన తరువాత 105 రోజుల వరకు వక్ర మార్గంలో పయనించి ప్రభావితం చేస్తాడు. శని దృష్టి పశ్చిమంపై ఉండి అక్కడే అస్తమించడం వల్ల పడమర దిక్కుని శని దిక్కుగా చెప్తారు. శాంతి ప్రక్రియలు చేపట్టిన దోషప్రభావం తగ్గి మేలుకలుగుతుంది. శనివారం ఉదయం నువ్వులనూనేతో శరీరానికి మర్ధన చేసుకొని స్నానం చేసి నువ్వులనూనేతో గాని, ఆముదం నూనెతోగాని తెలుపు లేదా నలుపు వత్తులను పడమర దిక్కున ఇనుప గరిటెలో శని దీపాన్ని పెట్టి దానికి నువ్వులు బెల్లం కలిపిన చిమ్మిలిని నైవేద్యం పెట్టాలి.

తరువాత ఈ క్రింది శ్లోకం చదవాలి.

**శని బాధా వినాశాయ ఘోర సంతాప హారిణే। కనకాలయ వాసాయ భూతనాధాయతే నమః దారిద్ర్యజాతాన్ రోగాదీన్ బుద్ధిమాంద్యాది సంకటాన్। క్షిప్రం నాశయ హే దేవ! శని బాధా వినాశక ॥ భూత బాధా మహాదుఃఖ మధ్యవర్తిన మీశమాం। పాలయ త్వం మహాబాహో సర్వదుఃఖ వినాశక॥ అవాచ్యాని మహాదుఃఖ న్యమేయాని నిరంతరం। సంభవంతి దురంతాని తాని నాశయమే ప్రభో॥ మాయా మోహన్యానంతాని సర్వాణి కరుణాకర । దూరి కురు సదాభక్త హృదయానందదాయక॥ అనేక జన్మ సంభూతాన్ తాప పాపాన్ గుహేశ్వర। చూర్ణీకురు కృపాసింధో సింధుజాకాంత నందతే॥ ఉన్మాదోధ్భూత సంతాపా గాధకూపాద్మహేశ్వర। హస్తావలంబం దత్వా మాం రక్షరక్ష శనైశ్చర॥ దేహిమే బుద్ధి వైశిష్ట్యం దేహిమే నిత్య యౌవనం। దేహిమే పరమానందం దేవదేవ జగత్పతే॥**

ఈ శ్లోకాన్ని ప్రతిరోజు ఉదయాన్నే 19 సార్లు పఠించిన శనిదోషం తొలగిపోవును.

## నామ నక్షత్ర రాశి, గణ, నాడీ పొంతనములు

| నామాక్షరమాలిక | | | | నక్షత్ర పాదములకు రాశులు | గణములు | జంతువులు | నాడి |
|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | లా | అశ్విని 4 మేషం | దేవ | గుర్రం | ఆది |
| లీ | లూ | లే | లో | భరణి 4 మేషం | మనుష్య | ఏనుగు | మధ్య |
| ఆ | ఈ | ఊ | ఏ | కృత్తిక 1 మేషం 3 వృషభం | రాక్షస | మేక | అంత్య |
| ఓ | వా | వీ | వు | రోహిణి 4 వృషభం | మనుష్య | పాము | అంత్య |
| వే | వో | కా | కి | మృగ 2 వృష 2 మిధున | దేవ | పాము | మధ్య |
| కూ | ఖం | జ్ఞ | ఛా | ఆరుద్ర 4 మిధున | మనుష్య | కుక్క | ఆది |
| కే | కో | హా | హీ | పున3 మిధున1 కర్కాటకం | దేవ | పిల్లి | ఆది |
| హు | హే | హో | డా | పుష్య 4 కర్కాటకం | దేవ | మేక | మధ్య |
| డీ | డూ | డే | డో | ఆశ్లేష 4 కర్కాటకం | రాక్షస | పిల్లి | అంత్య |
| మా | మీ | మూ | మే | మఖ 4 సింహం | రాక్షస | ఎలుక | అంత్య |
| మో | టా | టీ | టూ | పుబ్బ 4 సింహం | మనుష్య | ఎలుక | మధ్య |
| టే | టో | పా | పీ | ఉత్తర 1 సింహం 3 కన్య | మనుష్య | గోవు | ఆది |
| పూ | షం | ణా | ఠా | హస్త 4 కన్య | దేవ | దున్న | ఆది |
| పే | పో | రా | రి | చిత్త 2 కన్య 2 తుల | రాక్షస | పులి | మధ్య |
| రూ | రే | రో | త | స్వాతి 4 తుల | దేవ | దున్న | అంత్య |
| తీ | తూ | తే | తో | విశా 3 తుల 1 వృశ్చి | రాక్షస | పులి | అంత్య |
| నా | నీ | నూ | నే | అనూ 4 వృశ్చికం | దేవ | లేడి | మధ్య |
| నో | యా | యీ | యు | జ్యేష్ఠ 4 వృశ్చికం | రాక్షస | లేడి | ఆది |
| యే | యో | బా | బి | మూల 4 ధనుస్సు | రాక్షస | కుక్క | ఆది |
| బూ | ధా | భా | ఢా | పూ॥షాఢ 4 ధనస్సు | మనుష్య | కోతి | మధ్య |
| బే | బో | జా | జి | ఉ॥షాఢ 1 ధను 3 మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| ఖి | ఖూ | ఖె | ఖో | అభిజిత్ మకరం | మనుష్య | ముంగిస | అంత్య |
| జూ | జే | జో | ఖా | శ్రవణం 4 మకరం | దేవ | కోతి | అంత్య |
| గా | గీ | గూ | గే | ధనిష్ఠ 2 మకరం 2 కుంభం | రాక్షస | సింహం | మధ్య |
| గో | సా | సీ | సు | శతభిషం 4 కుంభం | రాక్షస | గుర్రం | ఆది |
| సే | సో | దా | ది | పూ॥భా 3 కుంభం 1 మీన | మనుష్య | సింహం | ఆది |
| దు | శ్యం | ఝా | థా | ఉ॥భా॥ 4 మీనం | మనుష్య | గోవు | మధ్య |
| దే | దో | చా | చి | రేవతి 4మీనం | దేవ | ఏనుగు | అంత్య |

**విరోధ జంతువులు :** గుఱ్ఱము-దున్న, ఏనుగు-సింహం, మేక-కోతి, పాము-ముంగిస, కుక్క-లేడి, పిల్లి - ఎలుక, గోవు-పులి, **సందిగ్ధంగా ఉన్న పేర్లు :** శ్రీరామ - చిత్త 4వ పా॥, కృష్ణ- మృగశిర 3పా॥ జ్ఞానుడు- ఆరుద్ర 3వ పా॥, భీమ-మూల 3వ పా॥, భైరవ-పూ॥షాఢ 3వపా॥



# దినాధిపతులు - తారాబల గణన చక్రం

నిత్య నక్షత్రమునకు, జన్మ, లేక నామ నక్షత్రమునకు ఎదురుగా ఉన్న గడియందు దినాధిపతిని చూచుకొనవలయును దినాధిపతుల వద్దనున్న సంఖ్య ద్వారా తారబలము తెలుసుకొనవచ్చును

| నిత్య నక్షత్రములు → జన్మ నక్షత్రములు ↓ | | | అశ్విని మఖ మూల | భరణి పుబ్బ పూ॥షాఢ | కృత్తిక ఉత్తర ఉ॥షాఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ॥భాద్ర | పుష్యమి అనూరాధ ఉ॥భాద్ర | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | మఖ | మూల | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 |
| భరణి | పుబ్బ | పూ॥షాఢ | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 |
| కృత్తిక | ఉత్తర | ఉ॥షాఢ | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 |
| పునర్వసు | విశాఖ | పూ॥భాద్ర | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 |
| పుష్యమి | అనూ | ఉ॥భాద్ర | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 |

1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమిత్రతార ఇందు 1, 3, 5, 7 తారలు మంచివి కావు. 2, 4, 6, 8, 9 శుభప్రదమైనవి. ప్రతి ముహూర్తమునకు తారాబలము తప్పనిసరి



## దినాధిపతులు - ఫలితములు

**1. రవి :** శిరోవేదన, ఉష్ణ సంబంధిత పీడలు, అకాల భోజనం, ధన వ్యయం, కార్యఆటంకాలు. సాహసవంతమైన కార్యక్రమములు చేయుటకు. అధికార దర్శనమునకు

**2. చంద్రుడు :** మనస్సున సుఖం, సంతోషకరమైన మాటలు వినుట, స్త్రీ సౌఖ్యం, గొప్పవారితో స్నేహలాభములు కలుగును. గృహమున శుభకార్యములు చేయుటకు.

**3. కుజుడు :** కలహం, దేహము నలత, సోదర కలహం, స్థల వివాదములు, ఋణములు చేయవలసి వచ్చుట, కార్యాటంకము, దుర్వార్తలు వినుట, భయము, రక్తదర్శనం, శరీరమునకు అనారోగ్యము

**4. బుధుడు :** వ్యాపార లాభములు, బంధు మిత్రులతో ఇష్టాగోష్ఠి, విష్ణుభక్తి, పెద్దవారితో స్నేహలాభములు, నూతన వ్యాపారాదుల కొరకై ఆలోచనలు, కీర్తివృద్ధి, జ్యోతిష, గణిత శాస్త్ర విద్యను అభ్యసించుటకు.

**5. గురుడు :** విద్యా, ఉద్యోగ లాభములు, తేజస్సు, ధర్మకార్యమునకై ధనం ఖర్చు చేయుట, పెండింగు వ్యవహారములు పరిష్కరించుట, మంత్ర సిద్ధి బలము, రాజగౌరవము, స్త్రీ సౌఖ్యం, పండిత సంభాషణ, పెద్దవారితో పరిచయములకు, విద్యా ఉద్యోగ లాభములకు.

**6. శుక్రుడు :** నూతన వస్త్ర, వ్యాపారములు కలిసి వచ్చుట, స్త్రీ సౌఖ్యము, గురుభక్తి, ఇష్ట కార్యసిద్ధి, విందు విలాసములు, కళలయందు ప్రీతి, రావలసిన బాకీలు వచ్చుట జరుగును. సుగంధ ద్రవ్యవ్యాపారాదులకు, నూతన ఆభరణములు ధరించుట.

**7. శని :** మందబుద్ధి, ఏ పని ప్రారంభించినా ఆటంకములు, బంధు వైరములు, మనస్సునవికలం, ద్రవ్యనాశనం, చెడువార్తలు వినుట, నరముల బలహీనత, అనవసరపు ధనవ్యయం.

**8. రాహు :** జంతు భయం, పుత్రులతో విరోధములు, చెడు ఆలోచనలు, నీచులతో స్నేహం, శరీర బాధలు, కోపము అధికం, విధవాస్త్రీ కలహం.

**9. కేతు :** ఆధ్యాత్మిక కార్యక్రమములో పాల్గొనుట, అనవసరపు ధన వ్యయం, అధికారులతో విరోధములు, నేత్రబాధలు, అన్యగ్రామ నివాసం, శత్రు భయము, మనోవిచారం.



# తారాధిపతులు - ఫలములు

## దోష నివారణలు

**ఏ ముహూర్తమును ఆచరించాలన్నా కర్త యొక్క జన్మలేక నామ నక్షత్రములకు తారాబలము సరిపడి ఉండి శుభగ్రహ తారలను గ్రహించ వలెను.**

**1. జన్మతార : దోష ప్రదము సూర్యుడు అధిపతి :** మనస్తాపము, శిరోవేదన కలిగించును, తప్పని సరి పరిస్థితులయందు నక్షత్ర ప్రారంభం నుండి గం. 2.48 ని॥లు విడిచిపెట్టి మిగతా సమయంలో తోటకూర దానము ఇచ్చి ఉపయోగించవచ్చును.

**2. సంపత్తార : శుభప్రదము బుధుడు అధిపతి :** ద్రవ్యలాభము, ఆనందం, సుఖం, వ్యాపార వ్యవహార లాభము

**3. విపత్తార :** దోషప్రదము రాహు అధిపతి : విరోధములు, చెడు ఆలోచనలు, తప్పనిసరి పరిస్థితులలో నక్షత్ర ప్రారంభం నుండి గం.1-12 ని॥లు విడిచి పెట్టి, మిగతా సమయంలో బెల్లం దానం ఇచ్చి ఉపయోగించవచ్చును.

**4. క్షేమతార : శుభప్రదము గురువు అధిపతి :** తేజస్సు, గౌరవము, కీర్తి లాభము.

**5. ప్రత్యక్తార : దోషప్రదం కేతువు అధిపతి :** అధికార విరోధము, నేత్ర వ్యాధులు, శతృత్వములు తప్పని సరి పరిస్థితిలో నక్షత్ర ప్రారంభం నుండి గం.3-12 ని॥లు విడిచిపెట్టి మిగతా సమయములో ఉప్పు దానం ఇచ్చి ఉపయోగించవచ్చును.

**6. సాధనతార : శుభప్రదము చంద్రుడు అధిపతి :** పెద్దవారితో స్నేహ లాభం, సంతోషము.

**7. నైధన తార : మిక్కిలి దోష ప్రదము శని అధిపతి :** ఏ విషయమునా ఉపయోగించరాదు. వ్యాధి భయం, కార్యాటంకాలు ఈ తారను పూర్తిగా విసర్జించవలయును.

**8. మిత్రతార : శుభప్రదము శుక్రుడు అధిపతి :** సంతోషకరమైన వార్తలు వినుట, కార్యసిద్ధి

**9. పరమమిత్ర తార : శుభా శుభ మిశ్రమము కుజుడు అధిపతి** : దేహమునందు, నలతలు, కార్య ఆటంకములు.

27 నక్షత్రములను, 3 భాగములు చేయగా ఒక భాగమునకు 9 చొప్పున 3 నవకములు ఏర్పడును. ప్రథమ నవకములో జన్మతార 2వ నవకములో విపత్తార 3వ నవకములో ప్రత్యక్తారను విసర్జించవలెను. నైధనతారను పూర్తిగా విడిచిపెట్టవలెను.



## శ్రీవిళంబి నామ సంవత్సర ఫలితాంశములు

భగవంతుని యొక్క అనంతమైన ఈ సృష్టిలో కాలం కూడా అనంతమైనదే! ఈ అనంతమైన కాలాన్ని చాలా ఖచ్చితంగా నిర్ధారణ చేసారు మన మహర్షులు. ఈ కాలాన్ని లిప్తల నుండి ఘడియలుగా ఘడియల నుండి రోజులుగా రోజుల నుండి నెలలు సంవత్సరాలుగా, సంవత్సరాల నుండి యుగాలుగా, యుగాలు నుండి మహాయుగాలుగా, మహాయుగాల నుండి మన్వంతరాలుగా నిర్ణయించారు. ఈ సృష్టిని నడిపించే బ్రహ్మదేవునికి 14 మన్వంతరాలు 1 పగలు, 14 మన్వంతరాలు 1 రాత్రిగాను ఇలా 100 సం.రముల కాలం బ్రహ్మకాలమన్నారు. ఇప్పటి వరకు బ్రహ్మకాలంలో 50 సం.రాలు గతించి 7వ దైన వైవ స్వత మన్వంతరములో 27 మహాయుగాలు గతించి 28వ మహాయుగములో కృత, త్రేతా, ద్వాపరయుగాలు గతించి 4వది అయిన కలియుగ ప్రమాణం 4 లక్షల 32 వేల సం.రములలో 5118 సం.రం.లు గతించి 5119వ సంవత్సరము ఈ విలంబి నామ సంవత్సరము.

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారాబ్ధములు | 5245 | హిజరీ | 1438-1439 |
| కలియుగాబ్ధములు | 5119 | ఫసలి | 1426-1427 |
| గౌతమ బుద్ధాబ్ధములు | 2562 | భారతదేశ స్వాతంత్ర్యబ్ధములు | 71 |
| శ్రీ ఆదిశంకరాచార్యబ్ధములు | 2089 | ఆంధ్రరాష్ట్ర అవతరణ | 62 |
| శాలివాహన శతాబ్ధములు | 1940 | క్రీస్తుశకం | 2018-2019 |

శ్లో॥ విళంబి వర్షే త్వరిబృంద రోగైః । స్వల్పార్ఘన్ వృష్ట్యాపిచ చోర సంఘైః ।
నిస్వాః ప్రజాస్సత్వ విహీనమానాః । విదేశగాః స్వోదర పోషణాయ ॥

తా॥ శ్రీ విలంబి నామ సంవత్సరము వలన శత్రు రోగములు అధికము, తక్కువగా వర్షము, దొంగల వలన, దారిద్ర్యము వలన బాధలు పొందుట శరీరము బలహీన పడుట, మానహీనులు అగుట తమ పోషణ కొరకై యితర దేశములను నశించుట లేకవెళ్ళుట. శ్రీ విలంబి నామ సంవత్సరమునకు రాజు, ధాన్యాధిపతి - రవి, మంత్రి - శని అర్ఘాధిపతి, సేనాదిపతి, మేఘాధిపతి - శుక్రుడు సస్యాధిపతి, నీరసాధిపతి - చంద్రుడు, రసాధిపతి - బుధుడు అగుటవలన 6 ఆధిపత్యములు శుభులకు, 3 ఆధిపత్యములు పాపులకు వచ్చినవి. ఆరుద్ర ప్రవేశ కాలము పగలు అయినందున చిత్రమైన పంటలు పండును. సస్యనాశనము శుక్లపక్ష దశమి తిథి వలన శుభప్రదము. శుక్రవారం రోజు వలన శాంతి సౌభాగ్యము, ధరలు తగ్గును. పశుపాలకుడు యముడు అయినందున పశుసంపదకు కొంత అరిష్ఠదాయకం. స్వల్పవృష్ఠి, అల్పక్షీరము, అల్పతృణము కలిగించును. దొడ్డిపెట్టునాడు, విడిపించు వాడు. శ్రీకృష్ణుడు అయినందున కొంతమేర పశు అరిష్ఠము తగ్గును.

ఈ సంవత్సరములో 2 కుంచముల వర్షము కురియును. 60 యోజనములు విస్తీర్ణము 100 యోజనములు ఎత్తు గల వర్ష ప్రమాణములో 10 భాగములు సముద్రములు యందు, 7 భాగములు పర్వతములయందు 2 భాగములు భూమియందు వర్షించును. ఈ సంవత్సరము ద్రోణనామ మేఘం మేరు పర్వతానికి తూర్పు దిక్కున ఉద్భవించి మధ్య దేశములుయందు వర్షములు అధికముగా కురియును. అన్ని దేశములకు ఈ సం॥రం అశుభముగా యుంటుంది. ఎక్కువగా వర్షాలు కురియును. ఈ సం॥రం ఎరుపురంగు పంట ఎక్కువగా పండును. గోధుమ పంట లాభించును. నీటి పంటలు, మెట్ట పంటలు చక్కగా పండును. విళంబి నామ సంవత్సరమునకు నరేంద్రుడు అనే సర్పము అధిపతి అందువలన ఈ సం॥రం వర్షములు, వరదలు అధికము , జలాశయములు నిండును.

## ఉపనాయక నిర్ణయము

శ్లో॥ క్రూర గ్రహఫలం క్రూరం శుభగ్రహఫలం శుభం
పురోహితాది సర్వేషాం భవదీశ సముద్భవం

తా॥ పురోహితాది ఉపనాయక ఫలములన్నీయు, పాప గ్రహాలు, పాప ఫలమును శుభగ్రహాలు శుభ ఫలములను కలిగించును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాష్ట్రాధిపతి | – | రవి | శుభాధిపతి | – | రవి |
| స్త్రీణాధిపతి | – | శుక్రుడు | దేవాధిపతి | – | చంద్రుడు |
| వృక్షాధిపతి | – | రవి | జంగమాధిపతి | – | చంద్రుడు |
| అశ్వాధిపతి | – | శని | సర్వదేశాద్యోగి | – | శని |
| నరాధిపతి | – | శుక్రుడు | పరీక్షకుడు | – | చంద్రుడు |
| గణకాధిపతి | – | బుధుడు | సర్వాధిపతి | – | బుధుడు |
| గ్రామ నాయకుడు | – | చంద్రుడు | పురోహితుడు | – | కుజుడు |
| దైవజ్ఞుడు | – | శుక్రుడు | వస్త్రాధిపతి | – | బుధుడు |
| పశునాయకుడు | – | శుక్రుడు | మృగాధిపతి | – | శుక్రుడు |
| గ్రామ పాలకుడు | – | శుక్రుడు | రత్నాధిపతి | – | శుక్రుడు |
| శుభులు –14 పాపులు –7 | | | గజాధిపతి | – | కుజుడు |

## యోగ పంచకములు

1. **జ్యేష్ఠ శుక్ల పాడ్యమి :** గురువారము అగుట వలన జనులకు యోగదాయకంగా ఉండును. ప్రజలు క్షేమము, ఆరోగ్యము, సంతోషము కలిగియుండును. వర్షాలు అధికము.
2. **ఆషాడ శుక్ల పంచమి :** మంగళవారం ఆగుట వలన ఆందోళనలు, అల్లర్లు , రాస్తారోకోలు ప్రజలను ఇబ్బంది పెట్టుట.
3. **ఆషాఢ శుక్ల నవమి :** స్వాతి నక్షత్రం ఆగుట వలన గాలులు అధికముగా వీయుట, విత్తనములు మొలకెత్తుకుండుట.
4. **ఆషాఢ బహుళ ద్వాదశి :** ఏకాదశి రోహిణి నక్షత్రం అగుట వలన వర్షములు అధికముగా యుండును. పంటలు అన్నియు పండును.
5. **పుష్య బహుళ అమావాస్య :** సోమవారం అగుట వలన ఈ సం॥రం వర్షములు అధికముగా యుండును.

# నవ నాయక ఫలములు



1. **రాజు – రవి ఫలితము :** రవి రాజైనందున నాయకులు పరస్పర విరోధములు. బలాబలములు చూపుకొనుట యుండును. మేఘములు సమవృష్టి జనులకు నాయకులకు పరస్పర విరోధములు. ఆయుధములు వలన, దొంగలవలన, అగ్ని ప్రమాదములు వలన భయము కలగియుందురు.

2. **మంత్రి– శని ఫలితము :** శని మంత్రి అయినందున మంద వృష్టి, తక్కువ పంటలు. ప్రజలకు పీడ. మద్యపానము అధికము.

3. **సేనాధిపతి – శుక్రుడు ఫలితములు :** శుక్రుడు సేనాధిపతి అయినందున ధరలు అధికము, స్త్రీ, పురుషులు పరస్పరము అనురాగము కలవారై విందులు, వినోదాలతో జీవనం.

4. **సస్యాధిపతి– చంద్రుడు ఫలితము :** చంద్రుడు సస్యాధిపతి అయినందున నీటిపంటలు, మెట్ట పంటలు చక్కగా పండును. పండ్లు సమృద్ధిగా యుండును.

5. **ధాన్యాధిపతి – రవి ఫలితము :** రవి ధాన్యాధిపతి అయినందున మధ్యమ వృష్టి, తక్కువ ధరలు, తక్కువ పంట, ప్రతీ విషయమున భయము. ఎరుపు పంట పుష్కలంగా పండును.

6. **అర్ఘాధిపతి – శుక్రుడు ఫలితము :** శుక్రుడు అర్ఘాధిపతి అయినందున తెల్లని ధాన్యములకు, ధాన్యములకు అన్నింటికి ధరలు అనుకూలము, దేశము క్షేమము.

7. **మేఘాధిపతి – శుక్రుడు ఫలితము :** శుక్రుడు మేఘాధిపతి అయినందున వర్షములు అధికము, కరువు ఉండును. పంటలు సమృద్ధి. ఆవులు పెరుగును. రోగములు ఉండవు, కీటక భయం తక్కువ.

8. **రసాధిపతి – బుధుడు ఫలితము :** బుధుడు రసాధిపతి అయినందున మాగది, మాలతి, జాజి, పండ్లు, కర్పూరం, గుగ్గులము, అగరు, బెల్లం, రసవస్తువులు వృద్ధి రేటు అధికం.

9. **నీరసాధిపతి – చంద్రుడు ఫలితము :** చంద్రుడు నీరసాధిపతి అయినందున ముత్యములు, బంగారము, కంచు, వస్త్రములు, నగలు, పాలు, నీరు, బియ్యము సమృద్ధిగా యుండి ధరలు పెరుగును.

## శ్రీ విళంబి నామ సంవత్సర వర్ష లగ్న జగల్లగ్న ఫలితములు

| | | |
|---|---|---|
| | | ర బు చం శు / కే |
| రా | వర్షలగ్నం | |
| ల | గు | శ కు |

| | | |
|---|---|---|
| ల | ర శు | బు చం |
| రా | జగల్లగ్నం | కే |
| | గు | శ కు |

**18.03.2018 ఆదివారం ఉగాది**

శ్రీ విళంబి నామసంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి ప్రవేశించువేళ వర్ష లగ్నం. ఇది పూర్వాభాద్ర నక్షత్రం చతుర్థ చరణం మీనరాశి కన్యాలగ్నం అయినది. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించువేళ జగల్లగ్నం. ఇది ఉత్తరాభాద్ర నక్షత్రం ప్రథమ చరణం మీన రాశి వృషభలగ్నం అయినది. బ్రహ్మాండములో సూర్యభగవానుడు సంచారము చేస్తూ భూమండలాన్ని పరిపాలించడానికి 9 ప్రధాన శాఖలు (నవనాయకులు) 21 ఉపశాఖలు (ఉప నాయకులు)గా విభజించి ఈ శాఖలకు సూర్యాది సప్తగ్రహములకు ఆధిపత్యములు కలిగిస్తూ సకల జీవరాశి మనుగడలో ప్రారబ్ధానుసారముగ శుభా శుభాలను కలిగిస్తూ పరిపాలింప జేయుచున్నాడు. నవనాయకులు, ఉపనాయకులు, వర్షలగ్నం, జగల్లగ్నం వలన ప్రపంచములో జరుగు సమస్త శుభాశుభములు అనేక ముఖ్య సంఘటనలు, రాజకీయ పరిణామాలు. ప్రకృతి వైపరీత్యాలు మొదలైన ఎన్నో అంశములను విచారింపవచ్చునని మహర్షులు మనకు అందించిన జ్యోతిష్యశాస్త్రం తెలియజేస్తున్నది.

ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులు కృప వలన గాయత్రీమాత కరుణ వలన వారందించిన పరిజ్ఞానం మేరకు శ్రీ విళంబి నామ సంవత్సరములో జరిగే అంశములను వివరించుచున్నాను. వ్రాసిన వాటిలో కొన్ని అంశములు యధాతథముగా జరగవచ్చును. కొన్న జరగకపోవచ్చును. జరిగిన అంశములకు జ్యోతిశాస్త్రము యొక్క గొప్పతనమే అవుతుంది. జరగని వాటికి నా పరిజ్ఞాన లోపమే అవుతుంది.

శ్రీ విళంబి నామ సంవత్సరములో రాజు రవి – మంత్రి శని– సేనాధిపతి శుక్రుడు – సస్యాధిపతి చంద్రుడు – ధాన్యాధిపతి రవి – అర్ఘాధిపతి శుక్రుడు – మేఘాధిపతి శుక్రుడు – రసాధిపతి బుధుడు – నీరసాధిపతి చంద్రుడు అయివున్నారు. గురునకు కుజునకు ఏ ఆధిపత్యము రాలేదు.

ఈ నవనాయకులలో శుభులకు 6 ఆధిపత్యములు. పాపులకు 3 ఆధిపత్యములు వచ్చినవి. ఉపనాయకులలో 14 ఆధిపత్యములు శుభులకు, 7 ఆధిపత్యములు పాపులకు వచ్చియున్నవి– నవనాయకులలోను, ఉప నాయకులలోను

శుభాధిపత్యం అధికముగా ఉన్నందున దేశము సుభిక్షముగా ఉండును. ఉగ్రవాదులు, నక్సలైట్స్ వలన కలిగే ఉపద్రవాలను సమర్థవంతముగా ఎదుర్కొనగలరు. పరిపాలన ఉన్న నాయకులకు అధికార యంత్రాంగమునకు సమన్వయము బాగుంటుంది. అందువలన ప్రభుత్వ సంక్షేమ పథకాలు ప్రజలకు అందుబాటులో ఉండేందుకు ఎక్కువ కృషి చేయుదురు.

రవి రాజైనందున నాయకులలో పరస్పర విరోధములు, వాగ్విద్ధములు అధికముగా ఉంటాయి. రాజకీయ పరివర్తనములు రాజకీయ కల్లోలములు ఉంటాయి. ప్రజలకు నాయకుల వలన వత్తిళ్లు అధికముగా ఉంటాయి. ప్రజలు ఆరోగ్యపరంగా నలుగుతూ శస్త్ర చికిత్సలు అధికమౌతాయి. దేశములో దొంగతనములు పెచ్చుపెరుగును. అగ్ని ప్రమాదములు తరచు జరుగుచుండును.

మంత్రి శని అయినందున రాజు, మంత్రి వీరిద్దరు నైసర్గిక శతృవులు అయివున్నందున ప్రభువులకు, మంత్రులకు అన్యోన్య విరోధములు, వ్యతిరేకతలు కలిగించును. సేనాధిపతి శుక్రుని వలన రక్షణ శాఖలో స్త్రీలకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడును. రక్షణశాఖ ఒక విధంగా అభివృద్ధి పొందినను దేశంలో జరిగే అరాచక శక్తులు పట్ల సమ్మెలు, తిరుగుబాట్లు, విప్లవాలు, రాస్తారోకోలు వంటి సంఘటనలతో నిర్లిప్తత, ప్రేక్షక పాత్ర పోషించవలసి వస్తుంది. సస్యాధిపతి చంద్రుని వలన పంటలు బాగా పండుతాయి. మెట్టభూములు, పల్లపు భూములు, చెరువులు, నర్సరీలు, పండ్ల తోటలు ఫలించి అభివృద్ధికరంగా వుంటాయి. కొబ్బరి, వరి పంటలు, శెనగ, గోధుమ, కందులు, మిర్చి మొదలైన ఎరుపురంగు పంటలు లాభిస్తాయి. దైవజ్ఞుడు శుక్రుని వలన ఆధ్యాత్మిక దైవ సంబంధమైన ప్రచారములలో మాతాజీలు, స్త్రీలు ఎక్కువగాషఈ పాల్గొందురు. పురోహితుడు అంగారకుడైనందున అర్చక పురోహితాధి వర్గాలలోను అన్యోన్య కలహములు, దేవాదాయశాఖ నిబంధనలలో కొన్ని మార్పులు జరుగును. వృక్షాధిపతి రవి అయినందున అటవీ సంపదలో అక్రమ రవాణాలు ఎక్కువగా ఉంటాయి. అటవీశాఖలో అవినీతి, అక్రమాల వలన ఇబ్బందులు ఉంటాయి. వస్త్రాధిపతి బుధుడు అయినందున వస్త్ర వ్యాపారాదులు చేనేత, జౌళిశాఖ సంస్థలు మందకొడిగా సాగును.

రెండు లగ్నములను విశ్లేషించగా వర్ష లగ్నాధిపతి అయిన బుధుడు వృషభ లగ్నాధిపతి అయిన శుక్రుడు మిత్రులై శుభులు అయినందున కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమన్వయము బాగుంటుంది. వర్ష లగ్నములో బుధుడు శుక్ర చంద్రులతో కలిసి సప్తమి కేంద్ర స్థితి వలన శుభయోగము కలిగించును. ప్రభుత్వాలు చేపట్టిన అభివృద్ధి ప్రణాళికలు నిరాటంకముగా అమలు చేయగలరు. బుధుడు నీచ స్థితిలో ఉన్నందున వ్యయాధిపతి అయిన రవితో కలిసియున్నందున ప్రభుత్వ పనితీరులో రాజకీయం ఒడిదుడుకులు, అధిక ధనవ్యయం జరుగును. అలాగే అన్ని వ్యాపారాలలోను, వ్యాపార సంస్థలయందును, ఇన్‌కమ్ టాక్స్, సేల్స్ టాక్స్, డిపార్టుమెంటులలోను వ్యాపార కారకుడైన బుధుడు నీచస్థితి వలన అసంతృప్తి, ఒడిదుడుకులు కొన్ని నిబంధనలలో మార్పులు ఉంటాయి.

ధనాధిపతి శుక్రుడు ఉచ్ఛస్థితి, ధనకారకుడు గురుడు బలవంతుడై ఉన్నందున ప్రభుత్వ ఆదాయాలు, బ్యాంకు సర్వీసులు బాగుంటాయి. చతుర్థ కేంద్రములో శని కుజులు ఉన్నందున విద్యాసంస్థలు కొన్ని మూతపడే అవకాశాలున్నాయి. విద్యాశాఖలో కొన్ని కఠిన నిర్ణయాలు వస్తాయి. అలాగే నిర్మాణ రంగంలో నాణ్యతలు లోపించుట, అవకతవకలు, ఆలస్యం, భారీ నిర్మాణాలు కూలిపోవుట, లేదా రోడ్లు విస్తరణలో నష్టమగుట జరగవచ్చును. రోడ్లు, రైల్వేలైన్లు నిర్మాణాదులలో ఆటంకాలు, ఆలస్యం సూచిస్తుంది. సప్తమ కేంద్రమందు నాలుగు గ్రహములలో 3 గ్రహములు స్థితి బాగున్నందున ఇతర దేశములతోను, ఇతర రాష్ట్రములతోను సన్నిహిత సంబంధాలు, వ్యాపార లావాదేవీలు అనుకూలంగా ఉంటాయి. అనేక కంపెనీలతో మైత్రి ఒప్పందాలు కుదురుతాయి. శుక్రుడు ఉచ్ఛస్థితి వలన మహిళలకు ప్రభుత్వపరంగా అనేక రాయితీలు, ప్రత్యేక స్థానములు కల్పించబడును. రాజకీయరంగంలోను, ఇతర వ్యాపార సంస్థలలోను, ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలలోను ఉద్యోగ అవకాశములు స్త్రీలకే ప్రాధాన్యత కల్పించబడును. ప్రేమ వివాహాలు, కులాంతర వివాహాలు అధికమౌతాయి. సుగంధ ద్రవ్యాలు, మత్తు పానీయములు వాడకం పెరుగును. విందులు, వినోదములు, లగ్జరీలకు ధనం అధిక శాతం ఖర్చు చేయుదురు. కళలు, క్రీడారంగం ప్రపంచ ఖ్యాతి పొందును. సినీ పరిశ్రమ అభివృద్ధికరంగా సాగును. పంచమకేతు ఏకాదశ రాహు స్థితి వలన టి.వి. కంప్యూటర్ రంగాలలో వినూత్న మార్పులు, నూతన టెక్నాలజీతో అభివృద్ధి పొందును. టెలికం, సాఫ్ట్‌వేర్ రంగాలు ఆర్థికంగా పుంజుకుంటాయి. షేర్ మార్కెట్ బాగుంటుంది. వైజ్ఞానిక రంగం అభివృద్ధి పొందును. ఆరోగ్యమనే మహాభాగ్యం కొరకు ప్రజలు, నాయకులు యోగా ప్రకృతి నియమాలు వంటి ఎన్నో ఆరోగ్య సూత్రాలు ఆచరణలోనికి వస్తాయి.

జగల్లగ్నాధిపతి అయిన శుక్రుడు వ్యయమందు రవితో కలసియున్నందున అష్టమస్థానములో శని కుజులు కలసియున్నందున ప్రభుత్వాలు తలపెట్టిన ప్రణాళికలు అమలు చేయడంలో కొన్నింటికి అభ్యంతరములు, వ్యతిరేకతలు రావచ్చును. ప్రభుత్వ యంత్రాంగంలో పనిచేసే వారికి ఒత్తిడి, శ్రమ అధికంగా ఉంటాయి. ఇక గ్రహ గతులను పరిశీలన చేయగా

శ్రీ విళంబి నామ సంవత్సర ప్రారంభం 18.03.2018 నుండి ది.05.04. 2019 వరకు గ్రహ సంచారమును పరిశీలన చేయగా ది.09.03.2018 నుండి ది.10.07.2018 వరకు గురుడు వక్ర సంచారము వలన ఆర్థికశాఖ, బ్యాంకులు, దేవాదాయశాఖ, న్యాయశాఖలలో ఒడిదుడుకులు, సంస్కరణలు జరగవచ్చును. శెనగలు, జనపనార, పుగాకు, తుత్తునాగం, తగరం మొదలగు కొన్ని లోహములు ధరలు పెరిగే అవకాశమున్నది. షేర్ మార్కెట్‌లో పెరుగుదల ఉంటుంది. కొన్ని ఒడిదుడుకులు కూడా ఉంటాయి. ది.18.04.2018 నుండి ది.06.09.2018 వరకు శని వక్రగతి వలన పెట్రోల్, గ్యాస్, ఆయిల్స్ మొదలగు వారికి కొరత, ధరలు పెరుగుదల ఉండ వచ్చును. అవిసెలు, ఆవాలు, వేరుశెనగ, ఎండుకొబ్బరి, నువ్వులు, బొగ్గు, ఇనుము, సీసము వీటి ధరలు పెరుగుదలలో ఉండవచ్చును. ఏదో ఒక గనిలో ప్రమాదము సంభవించే అవకాశమున్నది.

ది. 02. 05. 2018 నుండి ది. 06. 11. 2018 వరకు మకరరాశిలో కుజుడు కేతువుతో కలిసి వక్రస్థితి, స్థంభన కలుగుట వలన ఒక రాశిలో 45 రోజుల పాటు సంచరించే కుజుడు 188 రోజులు ఒకే రాశిలో ఉండిపోవుట కుజస్తంభన అంటారు. దీని వలన రాజకీయ అలజడి, ప్రకృతి వైపరీత్యాలు కలిగించవచ్చును. భారతదేశంలో మరియు మెక్సికో, న్యూజీలాండ్ దాని పరిసర దేశములలో ప్రభుత్వాలు స్తంభన, ప్రతిపక్షం యొక్క అభియోగాలు, రాస్తారోకోలు, తిరుగుబాట్లు, రాజకీయ రంగంలో అశాంతి కలిగియుండును. ఎన్నికలు గడువుకంటే ముందుగా ఎలక్షన్లు నిర్వాహించాలని యోచనలు కలిగించ వచ్చును. కుజస్తంభనా కాలంలో దేశము యొక్క భోగభాగ్యములు, చర స్థిరాస్తులకు నష్టం లేదా అభివృద్ధి కుంటుపడును. ఇరుగుపొరుగు దేశములతో మైత్రి ఒప్పందాలు దెబ్బతినును. పెద్ద నాయకులలో అభిప్రాయ భేదాలు అధికంగా ఉంటాయి. టీ.వి. ఎలక్ట్రికల్, యంత్రసామాగ్రి, ఎరువులు, సిమెంట్, శెనగలు, బెల్లం, ఉలవలు, పసుపు, ధనియాలు ధరలు పెరుగును. రియల్ ఎస్టేట్‌లో ఒడిదుడుకులు ఉంటాయి. వ్యవసాయరంగంలో అభివృద్ధి కుంటు పడుతుంది. భూములు, అమ్మకాలు, కొనుగోలు సరిగా జరగవు. జూలై నుండి నవంబరు వరకు ప్రకృతి రీత్యా భారీవర్షాలు, తుఫాన్లు, వరదలు, భూకంపాలు వలన ఆస్తి నష్టం, ప్రాణ నష్టం కలిగించే గ్రహస్థితులున్నాయి.

పైన వ్రాసినవన్నీ సూచనగా మాత్రమే గ్రహించండి. పంచభూతాలు కలిగించే విపత్తులను నియంత్రించుటకు మానవ శక్తి చాలదు. సృష్టికర్త అయిన భగవంతుడనే రక్షణ కోరదాం! లోక రక్షనార్ధం ప్రతీవారు దైవనామ స్మరణ కలిగి ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులను కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని, జగన్మాతను ఎవరి ఇష్ట దైవాలను వారు ప్రార్థించుకొని రక్షణ పొందుదాం!

**స్వస్తిప్రజాభ్య: పరిపాలయంతాం న్యాయేన మార్గేన మహీం మహీశా**
**గోబ్రాహ్మణేభ్య: శుభమస్తు నిత్యం లోకా సమస్తాస్సుఖినోభవంతు।**

## గురు దయాబ్దఫలము

గురోదయం వైశాఖాబ్దము వలన నాయకులు, ప్రజలు ధర్మాసక్తి కలిగి యుందురు. భూమి పూర్ణముగా ఫలించును. బ్రాహ్మణులు యాగాది క్రతువులు ఆచరింతురు.

## సూర్యుడు ఆరుద్ర నక్షత్ర ప్రవేశము

ది. 22. 06. 2018 శుక్రవారం ఉదయం గం. 11. 11 నిIIలకు సూర్యుడు ఆరుద్ర నక్షత్రములో ప్రవేశించును. పగలు ప్రవేశము వలన సస్య నాశనము, శుద్ధ దశమి తిథి వలన శుభములు కలుగును. శుక్రవారం వలన శాంతి కలుగును. చిత్తా నక్షత్రం వలన కొన్ని ప్రదేశములలో పంటలు బాగుండును. మరికొన్ని ప్రదేశములలో నష్టము వాటిల్లును. సింహ లగ్నముల వలన అనావృష్టి కలుగును.

## బార్హాస్పత్య మానాబ్ధఫలము

బార్హాస్పత్య మానాబ్ధి విరోధకృత్ నామ సంవత్సరం అగుట వలన సకల జనులు పాలించే నాయకులు పరస్పర విరోధములు కలిగియుందురు. పంటలు, వర్షములు సామాన్యంగా ఉండును.

## గురు మౌఢ్యమి

**(12.11.2018 లగాయితు 10.12.2018 వరకు)**

ది.12.11.2018 సోమవారం మ.గం.12.18 ని॥లకు పశ్చాదస్తమితో గురు: పడమర దిశలో గురుడు అస్తమించుటవలన గురుమౌఢ్యమి ప్రారంభమై 10.12.2018 సోమవారం ఉ గం.9.40 ని॥లకు ప్రాగుదితో గురు: తూర్పు దిశలో గురుడు ఉదయించుట వలన గురుమౌఢ్యమి త్యాగమగును.

## శుక్ర మౌఢ్యమి

**(20.10.2018 లగాయితు 01.11.2018 వరకు)**

ది.20.10.2018 శనివారం ఉ గం.11.38ని॥లకు పశ్చాదస్తమితో శుక్ర: పడమర దిశలో శుక్రుడు అస్తమించుట వలన శుక్ర మౌఢ్యమి ప్రారంభమై

01.11.2018 గురువారం రాత్రి గం.3.09 ని॥లకు ప్రాగుదితో శుక్ర : తూర్పుదిశలో శుక్రుడు ఉదయించడం వలన శుక్రమౌఢ్యమి త్యాగమగును.

## మౌఢ్యమిలో చేయరానివి

బావి, చెరువులు త్రవ్వుట, యాగము చేయుట, గమనము, క్షురకర్మ, దేవతా ప్రతిష్టలు, వివాహ ఉపనయనములు, విద్యారంభం, గృహారంభ ప్రవేశములు, చెవులు కుట్టుట, మహాదానములు, వనములు స్థాపించుట, నూతన మంత్రానుష్టానము, పట్టాభిషేకము, వివాహ నిశ్చయ తాంబూలములు, పసుపు కుంకుమలు, నూతనముగా వ్యాపారములు ప్రారంభించుట, దత్తత స్వీకారము మొ. సమస్త శుభకార్యములు ఆచరించరాదు.

## మౌఢ్యమిలో ఆచరించేవి

గర్భిణీ స్త్రీలు పురిటికి వెళ్లుట, జనన శాంతులు, నవగ్రహ హెూమ దానములు చేయుట, జాతక రీత్యా గ్రహశాంతి ఆచరించుట, అన్నప్రాశన, నామకరణ, సమస్త వ్రతములు ఆచరించవచ్చును.

## భీమ నదికి పుష్కరాలు

**(12.10.2018 శుక్రవారం నుండి 23.10.2018 మంగళవారం వరకు)**

ది.11.10.2018 గురువారం రాత్రి గం.7.19 ని॥లకు గురుడు వృశ్చికరాశిలో ప్రవేశించుట వలన భీమనదికి సార్ధత్రికోటి తీర్ధ సహిత పుష్కర కాలం ప్రారంభమగును. 12వ తేదీన మొదలు 12 దినముల వరకు భీమ నదియందు మూడున్నర కోట్ల పుణ్యతీర్థాలు వాటికి అధిపతియైన పుష్కరుడు, సిద్దులు పితృదేవతలు, సమస్త దేవ గణాలతో పాటు బ్రహ్మదేవుడు భీమ నది యందు అధివహించి ఉండుట వలన భీమ నదీ జలాలు శక్తివంతంగా ప్రభావితం అవుతాయి. ఆ సమయంలో చేసే స్నానం, దానం, జపతపాలు, పితృదేవతలు నుద్దేశించు చేయు తీర్ధ,శ్రాద్ధ, తర్పణాదులు, దేవతార్చనలు చేయుటవలన పితృ దేవతలు తరించి వారి ఆశీస్సులు వలన మనకు ఆయురారోగ్యములు కలుగును. భీమశంకర్, పండరీపూర్‌లో పుష్కరాలు జరుగుతాయి.

## సంపూర్ణ చంద్రగ్రహణం

**(27.07.2018 శుక్రవారం)**

శ్రీ విళంబి నామ సంవత్సర ఆషాఢ శుద్ధపూర్ణిమ శుక్రవారం ఉత్తరాషాఢ నక్షత్రమందు రాత్రి గం. **11.54** ని॥లకు కేతు గ్రస్త సంపూర్ణ చంద్ర గ్రహణము సంభవించుచున్నది.

| | |
|---|---|
| స్పర్శ కాలము | రాత్రి గం. **11.54** |
| నిమీలనం | రాత్రి గం. **1.01** |
| మధ్యకాలమం | రాత్రి గం. **1.51** |
| ఉన్మలనం | రాత్రి గం. **2.40** |
| మోక్షకాలం | రాత్రి గం. **3.48** |



ఆధ్యంత పుణ్యకాలం - **3.54**

ఈ గ్రహణము ఉత్తరాషాఢ నక్షత్రం 4వ పాదంలో పట్టి శ్రవణా నక్షత్రం ప్రథమ పాదం విడుచుచున్నది. కావున ఉత్తరాషాఢ. శ్రవణ నక్షత్ర జాతకులు, మకరరాశి వారు చూడరాదు. మరునాడు ఉదయం గ్రహణ దోష పరిహారార్థము శివాలయములో రుద్రాభిషేకం చేయించుకొని రజిత చంద్ర బింబ ప్రతిమ, రజిత కేతు ప్రతిమ, కేజీంపావు బియ్యం, కేజీంపావు ఉలవలునందు ఉంచిగ్రహణ దానం ఇవ్వవలెను.

## దక్షిణాయణ-ఉత్తరాయణ ప్రారంభములు

ది. 16.07.2018 సోమవారం రాత్రి గం. 10.27 ని॥లకు సూర్యుడు కర్కాటక రాశిలో ప్రవేశించుటవలన దక్షిణాయణ ప్రారంభమగును. ఈరోజే దక్షిణాయణ పుణ్యకాలమగును.

ది. 14.01.2019 సోమవారం రాత్రి గం. 7.51ని॥లకు సూర్యుడు మకర రాశిలో ప్రవేశించుట వలన ఉత్తరాయణం ప్రారంభమగును. ఈ రోజే ఉత్తరాయణ పుణ్య కాలమగును.

## కర్తరి ప్రవేశము

ది. 04.05.2018 శుక్రవారం శుక్రవారం రాత్రి గం. 8.51ని॥ లకు సూర్య భగవానుడు భరణి నక్షత్రం 3వ పాదంలో ప్రవేశించడంతో చిన్న కర్తరి ప్రారంభమగును.

ది. 11.05.2018 శుక్రవారం సా.గం. 6.12 ని॥లకు సూర్య భగవానుడు కృత్తిక నక్షత్రం 1వ పాదంలో ప్రవేశించడంలో పెద్ద కర్తరి ప్రారంభమగును.

ది. 28.5.2018 సోమవారం రాత్రి గం. 1.42 ని॥లకు సూర్య భగవానుడు రోహిణి నక్షత్రం 2వ పాదంలో ప్రవేశించడంతో పెద్దకర్తరి త్యాగమగును.

**కర్తరిలో చేయరానివి :** కర్తరిలో చెట్లు కొట్టుట, ఇల్లు నేయించుట, గృహ సంబంధమైన వడ్రంగి, తాపీపనులు చేయరాదు - దేవాలయ పనులకు దోషం లేదు.

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆరు | పున | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 |
| 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 |
| స్వాతి | విశా | అనూ | జ్యేష్ట | మూల | పూ.షా | ఉ.షా | శ్రవ | ధని | శత | పూ.భా | ఉ.భా | రేవ | |
| 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | |
| 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | 2 | 4 | 1 | 3 | 0 | |

కందాయము 1కి 4 నెలలు చొప్పున ఫలము వర్తించును. మొదటి సున్నా వలన భయము, వ్యాధి, మధ్య సున్నా వలన ధన నష్టము, అవమానములు, చివరి సున్నా వలన ధన నష్టము, వ్యర్థ ఫలం బేసి సంఖ్య వలన ధనలాభము,సమ సంఖ్య మిశ్రమ ఫలం సున్నా వలన శూన్యఫలం కలుగును.

## ద్వాదశరాశులకు

| ఆదాయ - వ్యయములు | | | | రాజపూజ్యం - అవమానములు | | | |
|---|---|---|---|---|---|---|---|
| | రాశి | ఆదా | వ్యయ | | రాశి | రాజ | అవ |
| 1 | మేషం | 2 | 14 | 1 | మేషం | 5 | 7 |
| 2 | వృషభం | 11 | 5 | 2 | వృషభం | 1 | 3 |
| 3 | మిథునం | 14 | 2 | 3 | మిథునం | 4 | 3 |
| 4 | కర్కాటక | 8 | 2 | 4 | కర్కాటక | 7 | 3 |
| 5 | సింహం | 11 | 11 | 5 | సింహం | 3 | 6 |
| 6 | కన్య | 14 | 2 | 6 | కన్య | 6 | 6 |
| 7 | తుల | 11 | 5 | 7 | తుల | 2 | 2 |
| 8 | వృశ్చికం | 2 | 14 | 8 | వృశ్చికం | 5 | 2 |
| 9 | ధనస్సు | 5 | 5 | 9 | ధనస్సు | 1 | 5 |
| 10 | మకరం | 8 | 14 | 10 | మకరం | 4 | 5 |
| 11 | కుంభం | 8 | 14 | 11 | కుంభం | 7 | 5 |
| 12 | మీనం | 5 | 5 | 12 | మీనం | 3 | 1 |

సర్వదాయకం 99 = సర్వ వయ్యం 93 = 6 ధనం

## నక్షత్ర సాముదాయ ఫలం

| | | | | |
|---|---|---|---|---|
| అశ్వి | పుష్య | స్వాతి | అభి | **అర్థలాభం** : వృత్తి, వ్యాపారం, ఉద్యోగములతో లాభము కలుగును. |
| భర | ఆశ్లే | విశా | శ్రవ | **మనస్తాపం** : ఏదో ఒక సమస్య వలన మానసిక ఒత్తిడి, అశాంతి కలిగించును. |
| కృత్తి | మఖ | అనూ | ధని | **రాజపూజిత** : సంఘంలో కీర్తి ప్రతిష్టలు పెరుగును. పదవులు అలంకరింతురు. |
| రోహి | పుబ్బ | జ్యేష్ఠ | శత | **యుద్ధం** : ప్రతి వారితో కలహం, శతృ వృద్ధి, తిరుగుబాట్లు. |
| మృగ | ఉత్త | మూల | పూ.భా | **భూషణం** : నూతనవస్తు, వస్త్ర, వాహన లాభములు కలుగును. అలంకార వస్తువులు ధరింతురు. |
| ఆరు | హస్త | పూ.షా | ఉ.భా | **రోగం** : అనారోగ్యములు, ఔషధసేవ, శారీరక మానసిక రుగ్మతలు. |
| పున | చిత్త | ఉ.షా. | రేవ | **ఆయువు** : దీర్ఘ రోగముల నుండి ఉపశమనం కలిగి ఆరోగ్యం కలుగును. |

## గ్రహములకు మిత్రత్వ శత్రుత్వములు

| గ్రహములు | రవి | చం | కుజ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం<br>గురు<br>కుజ | రవి<br>బుధు | రవి<br>చం<br>గురు | రవి<br>శుక్ర | చం<br>కుజు | బుధు<br>శని | బుధు<br>శుక్ర |
| శత్రువులు | శుక్రు<br>శని | లేరు | బుధు | చం | బుధు<br>శుక్ర | రవి<br>చం | రవి<br>చం,కు |
| సములు | బుధ | గురు<br>కు<br>శుక్ర<br>శని | శుక్ర<br>శని | కుజు<br>గురు<br>శని | శని<br>రవి | కుజు<br>గురు | గురు |



# కన్యారాశి

ఉత్తర 2, 3, 4 పా॥
హస్త 1, 2, 3, 4 పా॥
చిత్త 1, 2 పా॥

**ఆదాయం : 14, వ్యయం : 2, రాజపూజ్యం : 6, అవమానం : 6**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 5**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

ఉత్తర నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు
హస్త నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 2, అదృష్ట రత్నం ముత్యము
చిత్త నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము

ఉత్తర నక్షత్ర స్త్రీ, పురుషులు కెంపు కుడిచేయి ఉంగరం వ్రేలునకు, హస్త నక్షత్ర స్త్రీ, పురుషులు ముత్యము కుడిచేయి చూపుడు వ్రేలునకు, చిత్త నక్షత్రము గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమును ధరించుట అత్యంత శ్రేయోదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11 వరకు ద్వితీయ స్థానమున తులారాశియందు తదుపరి సంవత్సరాంతం వరకూ తృతీయ స్థానమున వృశ్చికరాశియందు సంచరించునని ఈ సంవత్సరం అంతయూ అర్ధాష్టావస్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహుకేతువులు 2019 మార్చి 7వ తేదీ వరకూ రాహువు ఏకాదశయందు కర్కాటక రాశియందు, కేతువు పంచమ స్థానమున మకరరాశియందు సంచరించును. తదుపరి సంవత్సరాంతం వరకు రాహువు దశమస్థానమున మిధునరాశియందు, కేతువు అర్ధాష్టమ స్థానమున ధనూరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురుడు ద్వితీయ, తృతీయ స్థానముల యందు, శని అర్ధాష్టమ స్థానమున, రాహువు ఏకాదశ, దశమ స్థానమున, కేతువు పంచమి అర్ధాష్టమ స్థానముల యందు సంచారం చేయుట వలన ఈ సంవత్సరం మొత్తంగా శుభా శుభ మిశ్రమముగానే ఉండును. గతము కంటే అన్ని విధాలా బాగుండును. కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. రాజకీయ వ్యవహారమందు జయము సంపూర్ణ ఆరోగ్యము, అనుకున్న పనులు పూర్తి అగుట, శత్రుజయము, శుభప్రద మాటలు వినుట, పుణ్యపురుషుల దర్శనములు, తేజస్సు

వృద్ధి, పెద్దవారితో పరిచయాలు, ధన ధాన్యాభివృద్ధి తీర్థయాత్రలు చేయుట, పాత ఋణములు తీర్చగలరు. విద్యార్థులకు అత్యధిక మార్కులు, ఉన్నత విద్యలు అభ్యసించుటకు మంచికాలం, స్త్రీలకు కుటుంబ కలహములు, జాగ్రత్త అవసరము. అగ్ని సంబంధిత ప్రమాదములు జరుగును. జాగ్రత్త అవసరము. అక్టోబరు 11 నుండి గురుడు తృతీయ స్థాన సంచారం చేయుట వలన శని, గురులు ఇరువురు మంచి స్థానముల యందు లేకుండుటచే పని ఒత్తిడి పెరుగుట, బంధుమిత్రులు శత్రువులతో విరోధములు, ధనముచేతికి వచ్చే వరకు కూడా ఇబ్బందులు. ఋణ బాధలు, విపరీత ధనవ్యయం. శరీరం నందు వేరే అవయవం నందు నొప్పులు, ఉద్యోగం యందు ప్రసవములు, దేహముల యందు విపరీత నీరసము. టీచర్స్, పోలీసు, కోర్టు సంబంధపు ఉద్యోగస్తులకు అనుకోని విధంగా స్థానమార్పులు, నూతన వ్యక్తుల వరిచయాలు, కుటుంబంనకు దూరంగా ఉండి సంపాదించుట, దేవాదాయ, ఇన్సురెన్స్ శాఖల వారికి అనుకూలము, ప్రమోషన్లు, కవులు, గాయకులు పురోహిత వృత్తుల వారికి అంత లాభదాయకంగా ఉండదు. నిరుద్యోగులకు, ఉద్యోగ అవకాశములు, విదేశీ ప్రయత్నములు కలసి రాకుండుట, రాజకీయ నాయకులకు ప్రభుత్వం వల్ల లాభము, చెరువుల వ్యాపారస్తులకు కలసిరాదు.

**దోష పరిహారం :** ఈ రాశి వారు ' కేతుగ్రహ ' శాంతి ఆగష్టు నెల యందు గురుగ్రహ శాంతి జరిపించాలి. గృహమున నమక పారాయణ, మన్యుసూక్త పారాయణ జరిపించాలి. ప్రతీ ఏకాదశి యందు నియమం పాటించాలి. సంకష్టహర చతుర్థి నాడు గణపతికి మరియు మూలా నక్షత్రమున అమ్మవారికి అర్చనలు జరిపించాలి. మంగళవారం నియమం పాటించాలి. కేతుగ్రహ రక్ష, దుర్గా రక్ష ధరించుట వలన దోష సాంద్రత తగ్గి శుభఫలములు కలుగును.

**మార్చి:** ఆదాయం మించిన ఖర్చులు, ధనము ఏదో విధంగా చేతికి అందుట, వ్యాపార వ్యవహారములు అనుకూలించుట, సన్మావాదులు దైవకార్యములు కొరకై ధనము వెచ్చించుట, మీ కింద పనిచేయు వారి వల్ల ఇబ్బందులు.

**ఏప్రియల్:** నూతన వ్యాపారములకై ఆలోచనలు సిద్ధించును. నూతన పరిచయాలు సత్పురుషుల యొక్క ఆశీర్వచనములు, ఇంటియందు సంతోషము, శుభాశుభ మిశ్రమము ఇంటా బయట, గౌరవ మర్యాదలు, జాయింటు వ్యాపారములయందు కొత్త చిక్కులు, కాంట్రాక్టు దారులకు బిల్లులు రాకుండుట వలన ఇబ్బందులు.

**మే:** వివాహాది శుభకార్యములు కలసి వచ్చుట, పుణ్యతీర్థ స్నానములు, పుణ్యక్షేత్ర దైవదర్శనాదులు చేయుదురు. భార్యా బిడ్డలతో సంసారము సుఖముగా సాగును. బంధు మిత్రాదులతో ఉల్లాసంగా ఉందురు. ఇంటి యందు వివాహ కార్యములు నెరవేరును. కోర్టు వ్యవహారములు కలసి వచ్చును.

**జూన్:** సంఘములో గౌరవం తగ్గుట, ఇంటా బయట మీ మాటకు విలువ తగ్గుట, జాయింటుదారులు విడిపోవుట, కాయగూరలు సంబంధిత వ్యాపారస్తులకు

లాభములు, రాజకీయ నాయకుల వల్ల స్వల్ప విరోధాలు, సోదర కలహములు ఇష్టము నెరవేరుట, అపవాదులు, అజీర్ణవ్యాధులు, మాటా మాట పట్టింపులు.

**జూలై:** నాయకత్వ లక్షణాలు, సంఘమునందు గౌరవము, తూర్పుదిశ ప్రయాణ లాభములు, కళాకారులకు మంచి గుర్తింపు, విద్యార్థులకు యోగవంతంగా ఉండును. చిన్న చిన్న వ్యాపారస్తులకు చేతి వృత్తి పనివారలకు యోగవంతంగా ఉండును. శ్రమకు తగిన ఫలితం కన్పించును. ఉద్యోగ ప్రయత్న లాభము అనుకూలించును. ఆకస్మిక ధనలాభము పాత బాకీలు వసూలు అగును.

**ఆగష్టు:** సోదరులతో కలహములు, నూతన వ్యక్తుల పరిచయంవల్ల మోసపోవుట, స్నేహితులతో చిన్న చిన్న విరోధాలు, సోమరితనం కల్గిఉండుట, అపనిందలు, వ్యాపార భంగపాటు, కుటుంబమున అనారోగ్యములు, చర్మ సంబంధిత అనారోగ్యములు, సంతానముతో సమస్యలు.

**సెప్టెంబరు:** భార్యకు అనారోగ్యము, అధికారుల ఒత్తిడి, అనుకోని సంఘటనలు, పీడకలలు వచ్చుట, మిత్రులతో వ్యసన పూరిత ధనవ్యయం, ఇష్టము నెరవేరకుండుట, అపవాదులు, అజీర్ణ వ్యాధులు, మాటా మాటా పట్టింపులు, ఋణములు పెరుగుట, సంతాన లాభములు.

**అక్టోబరు:** వైద్యునితో సంప్రదింపులు, చేతి వృత్తి వారికి బాగుండును, వస్త్ర పరిశ్రమల వారికి లాభములు, కళాకారులకు మంచి అవకాశాలు వచ్చును. ప్రయత్నించిన కార్యములు ఆలస్యముగా విజయవంతం అగును, గతంలో చేసిన తప్పులు ఈ మాసంలో బయటపడును, ఇంటియందు దొంగతనములు.

**నవంబరు:** ఈ మాసము శుభాశుభ మిశ్రమము కుటుంబములో విరోధములు తొలగి ఏ వ్యవహారమైనా ఆలస్యముగా పూర్తి అగుట పై అధికారుల వల్ల కొన్ని వ్యవహారములు కలసి వచ్చుట, ఫైనాన్స్ వ్యాపారస్తులకు ధన నష్టము, రాజకీయ నాయకులు మౌనం వహించుట మంచిది.

**డిశంబరు:** ఋణములు చేయుట, వ్యవహారములు ఆలస్యముగా పూర్తి అగుట, వాక్కాటిన్యత పెరుగుట, ప్రతీ విషయం నందు ఆధిక్యత, భార్య భర్తల మధ్య అన్యోన్యత కలిగి ఉండును.

**2019 జనవరి:** శుభా శుభ మిశ్రమము, లేనిపోని విషయములందు తల దూర్చుట వలన ఇబ్బందులు, స్నేహ మాలక సహాయ సహకారాలు అందుట, నూతన వస్త్ర లాభములు చేయు కృషియందు లాభములు , తల్లికి అనారోగ్య సూచనలు, మాతృ వంశీకుల నుండి అపనిందలు పాలు అగుట, వ్యాపారం నందు లాభములు.

**ఫిబ్రవరి:** నూతన పరిచయాలు, వృత్తి వ్యాపారస్తులకు మంచికాలం, ప్రతీ పనియందు ముక్కుసూటిగా పోవుట మంచిది కాదు, సర్వత్రా అనుకూలము, సర్వకార్యములు సిద్ధించుట, అనుకూల ప్రయాణాలు, పుణ్యతీర్థయాత్రలు చేయుట, దైవ సంబంధిత కార్యముల కొరకై ధనము ఖర్చు చేయుదురు. సంఘము నందు గౌరవం పెరుగును.

**మార్చి:** అన్నింటా జయము, మానసిక సంతోషము, వ్యాపార లావాదేవీలు బాగుండును, అన్నింటా విజయము చేకూరుట, పెండింగ్ వ్యవహారములు పూర్తి అగుట, నూతన స్త్రీ పరిచయాలు, మీ మాటకు ఎదురు లేకుండుట, పట్టిందల్లా బంగారము అన్నట్లు ఉండును, అనుకున్న కార్యములన్నియు నెరవేరును.



# తులారాశి

చిత్త 3, 4 పా॥
స్వాతి 1, 2, 3, 4 పా॥
విశాఖ 1, 2, 3 పా॥

**ఆదాయం : 11, వ్యయం : 5, రాజపూజ్యం : 2, అవమానం : 2**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 6**

## అదృష్ట సంఖ్యలు-రత్నములు

చిత్త నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము
స్వాతి నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 4 అదృష్ట రత్నం గోమేధికం
విశాఖ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం

చిత్త నక్షత్ర స్త్రీ, పురుషులు పగడము కుడిచేయి ఉంగరం వ్రేలునకు, స్వాతి నక్షత్ర స్త్రీ, పురుషులు గోమేధికం కుడిచేయి మధ్య వ్రేలునకు, విశాఖ నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు ధరించాలి. రత్న సబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట అత్యంత శ్రేయోదాకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులు గురుడు అక్టోబరు 11 వరకు జన్మరాశి తులారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వితీయ స్థానమున వృశ్చికరాశి యందు సంచరించును. శని ఈ సంవత్సరం అంతయూ తృతీయ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు, కేతువులు 2019 మార్చి 7వ తేదీ వరుకు రాహువు దశమ స్థానమున కర్కాటకరాశి యందు కేతువు అర్థాష్టమస్థానమున మకరరాశి యందు సంచరించును. తదుపరి సంవత్సరాంతం వరకూ రాహువు నవమ స్థానమున మిధునరాశి యందు కేతువు తృతీయ స్థానమున ధనూరాశియందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్నీ పరిశీలన చేయగా గురుడు జన్మరాశి ద్వితీయమున, శని తృతీయమున, రాహువు దశమ నవమ స్థానమున, కేతువు అర్థాష్టమి తృతీయ స్థానము యందు సంచారం చేయుట వలన ఈ సంవత్సరం ప్రథమార్థం 5 మాసములు శుభాశుభ మిశ్రమముగా తరువాత సంవత్సరం యోగప్రదముగా ఉండును. మొదటగా పెద్దవారి కోపానికి గురి అగుట, కీర్తి ప్రతిష్ఠలు కోసం అరాటపడుట. ఉద్యోగ, వ్యాపార, వ్యవహార, విద్య విషయములు యందు విరోధములు కొని తెచ్చి పెట్టుకొనుట. ఎవరు ఏమి చెప్పిననూ వినక తనకు తోచినట్లే చేసి ధనము పోగొట్టుకొందురు. తరువాత భయం, ఆదందోళన గురి అయ్యి మనస్సున ఆందోళన పెంచుకొనుట. మరుసటి సంవత్సరం జరిగిన

ఇబ్బందులను గుర్తుంచుకొని క్రమశిక్షణతో కూడిన జీవనాన్ని అలవరచుకొని అభివృద్ధిని పెంపొందించుకొనును, మనస్సున ఆనందము, తేజస్సు వృద్ధి. స్నేహితుల వలన ఏదో విధంగా ధనము చేతికి అందుట, నూతన గృహ నిర్మాణాలు చేపట్టుట. భూ, గృహ, ధన, గౌరవాదులు పెరుగుట, విందు, వినోదాల యందు పాల్గొనుట, పుణ్యనదీ, తీర్థ యాత్రలు చేయుట. నూతన వ్యాపారదులకు పెట్టుబడులు పెట్టుట. అప్రయత్న కార్యసిద్ధి, మంచి ఆరోగ్యం, రాజకీయ నాయకులకు కొత్త పదవులు, విద్యార్థులకు అనుకూలం. వ్యవసాయదారులకు కలసి వచ్చుట. స్థిరాస్తి అభివృద్ధి. కోర్టు వ్యవహారములు కలసి వచ్చుట, వాహన లాభం. స్వతంత్ర జీవనం చేయు వారికి అన్ని విధాల బాగుండును. విదేశీ ప్రయాణములు కలసి వచ్చును. విందు వినోదములలో పాల్గొనుట. పెద్ద అధికారులతో స్నేహలాభం. బంధువులు, మిత్రుల యందు చాకచక్యంగా మసులుట మంచిది. గతము జరిగిన రెండు సంవత్సరముల నుండి ఉన్న ఇబ్బందులు తొలగి సంతోషం. ధనాదులు 2,3 విధాలు పెరుగుట గృహము నందు ఆగి ఉన్న శుభకార్యాలు సిద్ధించును. సంతోషకరమైన మాటలు వినుట. సంతానం లేని వారికి సంతానం. ఉద్యోగస్తులకు ఆరోగ్యం నందు జాగ్రత్త అవసరం, ఆకస్మిక ప్రయాణం, భార్య భర్తల మధ్య అన్యోన్యం. ఉద్యోగస్తులకు అనుకూలమైన ప్రదేశాలకు ట్రాన్స్‌ఫర్‌లు. చెరువుల వ్యాపారం వారికి ద్వితీయ పంట అనుకూలం. సినీరంగంలో ఉన్న యువతీ యువకులకు ప్రోత్సాహం. అర్థాష్టమ కేతువు వలన ఈ రాశి వారికి మాట నికరము లేకుండుట. నూతన స్త్రీ పరిచయం వలన భయప్రదం మంచిది కాదు. ప్రయాణము యందు అత్యంత జాగ్రత్త అవసరం. విద్యార్థులు సైన్స్ యందు శ్రద్ధ వహించాలి. రైల్వే ఆఫీసు ఉద్యోగస్తులకు మంచి యోగదాయకం. ఫ్యాషన్, బ్యూటీషియన్ వారు జాగ్రత్తగా ఉండవలసిన సమయం. ఆరోగ్యము జాగ్రత్తలు తీసుకోవాలి. ఈత, నదులలో, కాలవలులో దూకుట అనర్ధదాయకం.

**దోష పరిహారం :** ఈ రాశి వారికి గురుడు, కేతువు దోషప్రదులు. అక్టోబరు నెలలోపు గురు గ్రహమునకు జప, తర్పణ, అభిషేక. హోమాదులు తప్పక జరిపించాలి. పసుపు వస్త్రం, కందువ, 1 1/4 శనగలు దానం చేయవలెను. గృహములో లక్ష్మీ గణపతికి హోమము జరిపించాలి. కేతు గ్రహమునకు జప తర్పణ హోమాదులు జరిపించాలి. 11 శనివారములు దుర్గాదేవికి సహస్ర కుంకుమార్చన జరిపించి ఆఖరి వారం అన్నశాంతి చేయుంచుట వలన శ్రేయోదాయకం. గృహమున నరఘోష యంత్రం స్థాపన చేయించాలి.

**మార్చి:** ఆదాయం తగ్గును, ఇంటి యందు అనారోగ్యం, వృథాఖర్చు, శారీరక శ్రమ అధికం, కోపము, చికాకులు, శుభకార్యములు కలసి రాకుండుట. అభిప్రాయ భేదాలు , కీళ్ళ నొప్పులు, కోర్టు తగాదాలు, బంధువుల రాకపోకలు, భార్య తరపు వారితో విరోధాలు.

**ఏప్రియల్:** భూ సంబంధిత వ్యవహారముల యందు విజయం సాధించెదరు. దుష్టులతో సహవాసము, మనస్సునందు కలత, భార్య భర్తల మధ్య సఖ్యత లోపించుట, ఎత్తు నుండి పడిపోవట, మానసిక వ్యాకులత చెందెదరు, విరోధములు, చర్మ సంబంధిత అనారోగ్యములు.

**మే:** జంతు మూలక భయము, పరస్త్రీ వలన అవమానములు, మొదలుపెట్టిన పనులు కలసి రాకపోవుట. వ్యవహారము లందు చిక్కులు, రాజకీయ నాయకుల ఒత్తిడి పెరుగును. పై ఉన్న అధికారుల వల్ల స్వల్ప లాభములు, అనుకొన్న చోట్లకు బదిలీలు, ఉన్న సమస్యలన్నీ సజావుగా నెరవేరుట, సంతాన సౌఖ్యము.

**జూన్:** ధనము అనుకొన్న సమయానికి చేతికి అందుట, ఇంటి యందు వస్తు వాహన లాభములు, ధనము నిల్వ చేసుకొనుటకై ఆలోచనలు సఫలమగుట, చేయు వృత్తి వ్యాపారములందు లాభములు, ప్రయత్నించిన కార్యములు విజయవంతం అగుట, ఇంటి యందు శుభకార్యములు, పాత బాకీలు వసూలు అగుట, శత్రువులపై ఆధిక్యత.

**జూలై:** వంశవృద్ధి, మీ మాటకు ఎదురు లేకుండుట, చేతి వృత్తుల వారికి మంచి యోగదాయకముగా ఉండును, శ్రమకు తగిన ఫలితము లభించును, పెండింగ్‌లో ఉన్న పనులు త్వరితముగా నెరవేరును, ఇంటి యందు వాస్తు మార్పులు చేయుదురు, నూతన నిర్మాణాదులు కలసి వచ్చుట.

**ఆగష్టు:** ఇంటి యందు శుభకార్యములు, విందు వినోదాలయందు పాల్గొందురు. శరీరము నందు స్వల్ప అనారోగ్యములు, పెద్దవారి యందు గౌరవము కలిగి ఉండుట, కొత్త పరిచయాలు కలసి వచ్చుట, శతృలాభము, శ్రమకు తగిన ఫలితం, పెండింగ్‌లో ఉన్న పనులు నెరవేరుట.

**సెప్టెంబరు:** కీర్తి ప్రతిష్టల వృద్ధియగును. మనస్సున సౌఖ్యము, దూరదేశములోనున్న వారి వల్ల ధన లాభములు, స్త్రీ వలన సౌఖ్యము, ప్రయత్నించిన కార్యములు నెరవేరుట వలన ఆనందము, పుణ్యనదీ స్నానములు, తీర్థ యాత్రలు చేయుట గొప్పవారితో పరిచయాలు, సభా గౌరవములు, సన్మానములు.

**అక్టోబరు:** భయాందోళనలు, ఉష్ణ సంబంధిత అనారోగ్యము, తేజస్సు తగ్గును, స్త్రీ మూలక ఇబ్బందులు, శ్రమకు తగిన ఫలితం లేకుండుట, కోపము యొక్క ఆధిక్యత పెరిగి ఉండుట.

**నవంబరు:** మనస్సున ధైర్యము, ధర్మకార్యముల కొరకై ధనము ఖర్చు చేయుదురు. పట్టింపులు, స్థానచలనములు, చుట్టములతో ద్వేషము, శరీరమునకు అనారోగ్యము, అనవసరపు ప్రయాణముల వలన ధనవ్యయం.

**డిశంబరు:** భార్య తరుపున వారికి అనారోగ్యం, విపరీతమైన ధనవ్యయము, మనఃచాంచల్యము, ఇంటి యందు కలహములు, ధనము కొరకై ఇబ్బందులు, ఋణములు చేయుదురు, ఇంటియందు సోదర కలహములు, ఆయుధముల వలన ఇబ్బందులు, చోరభయము, చేయు కృషియందు విఘ్నములు.

**2019 జనవరి:** ఈ మాసము శుభా శుభ మిశ్రమముగా ఉండును. శ్రమకు తగిన ఫలితము ఉండుట, వివాహాది కార్యములు, అనుకూలించుట, స్వప్నమునందు చెడు కలలు వచ్చుట, బంధు మిత్రాదులతో ఇష్టాగోష్టి, తలకు సంబంధిత అనారోగ్యముల, శరీరం నందు బాధ.

**ఫిబ్రవరి:** తలకు సంబంధిత అనారోగ్యములు, వేళదాటిన భోజనములు, బంధు మిత్రాదులతో విరోధములు, స్థాన చలనములు, దుర్మార్గుల సహవాసము, విద్యార్థులకు కలసివచ్చును. శత్రువులు మిత్రులుగా మారుట, పూర్వ మిత్రుల కలయిక, కొత్త వ్యాపారం ప్రారంభమగును.

**మార్చి:** ఈ మాసము శుభాశుభ మిశ్రమము, ఆదాయం పెరుగును, ఇష్టము సిద్ధించును. మన క్రింద పనిచేయు వారి వల్ల లాభములు, ఆకస్మిక కలహములు, పాత బాకీలు అతి కష్టం మీద వసూలు అగును. ఆరోగ్యమునందు శ్రద్ధ వహించవలెను.



# వృశ్చికరాశి

విశాఖ 4 పా॥
అనూరాధ 1, 2, 3, 4 పా॥
జ్యేష్ఠ 1, 2, 3, 4 పా॥

**ఆదాయం : 2, వ్యయం : 14, రాజపూజ్యం : 5, అవమానం : 2**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 9**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

విశాఖ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం
అనూరాధ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 8, అదృష్ట రత్నం నీలము
జ్యేష్ఠ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 5, అదృష్ట రత్నం పచ్చ.

విశాఖ నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు, అనూరాధ నక్షత్ర స్త్రీలు నీలముఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, జ్యేష్ఠ నక్షత్ర స్త్రీ, పురుషులు పచ్చ కుడిచేయి చిటికిన వ్రేలును ధరించాలి. రత్న సంంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట అత్యంత శ్రేయోదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11వ తేదీ వరకు ద్వాదశ స్థానమున తులారాశియందు తదుపరి సంవత్సరాంతం జన్మరాశి వృశ్చికరాశి యందు సంచరించును. శని ఈ సంవత్సరం అంతయూ ద్వితీయస్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు, కేతువులు 2019 మార్చి 7వరకు రాహువు నవమ స్థానమున కర్కాటక రాశి యందు కేతువు తృతీయ స్థానమున మకరరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకు రాహువు అష్టమ స్థానమున మిధునరాశి యందు కేతువు ద్వితీయ స్థానమున ధనూరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురుడు ద్వాదశి జన్మరాశుల యందు శని ఏలినాటి శనిగా ద్వితీయ స్థానమున రాహువు నవమి అష్టమ రాశుల యందు, కేతువు తృతీయ, ద్వితీయ స్థానముల యందు సంచారం చేయుట వలన ఈ సంవత్సరం ఫలితములు ఆశించిన మేరకు ఉండవు. ముందుగా గురుడు శుభకార్యముల నిమిత్తమై ధాంభికమునకు పోయి మంచినీళ్ళ వలె ధనము ఖర్చు చేయుట. నమ్మదగిన వారిని, నమ్మదగని వారిని ఒకేలా చూస్తూ ధననష్టం కొని తెచ్చుకొనుట. ఉన్న ఊరు వదిలి ఇతర ప్రదేశములకు వెళ్ళవలసిన స్థితి లేక చేయు వృత్తి, వ్యాపార, ఉద్యోగముల యందు నష్టములు లేక స్థాన చలనములు. దారిద్ర్యం, విపరీత కోపం, కీర్తి నష్టం అనరాని మాటలు

అనుటపడుట, చేయు ప్రతీ పనియందు విరోధములు. బుద్ధి నికరం లేకపోవుట. ధనహాని, భయాందోళనలు, శని ఏలినాటి శని వలన కారణం లేకుండగానే విరోధములు, విశేషమైన కష్టములు ప్రతీ కార్యం నశించుట. అనవసరపు ప్రయాణములు తన సొంత మనుష్యులతో మరియు బంధు మిత్రులతో విరోధములు తరువాత కూర్చుని బాధపడుట. వ్యవసాయం అనుకూలించక పోవుట, తాకట్టు పెట్టి, ధన, ఋణాదులు పెరుగుట. ప్రయాణముల యందు ఆటంకములు లేక దుఃఖము, శస్త్ర చికిత్సలు, శారీరక, మానసిక, చర్మ అనారోగ్యములు. మిత్ర వర్గంతో దూరంగా ఉండుట. శత్రువర్గంతో దగ్గరగా ఉండి వివాదములు. కుటుంబం నందు ప్రోత్సాహం తగ్గుట. అకాల భోజనాలు, ఔషధసేవ, ఉన్నతమైన కార్యములయందు, వ్యవహారముల యందు కంగారు పడి ఇబ్బంది పడుట. భార్యకు అనారోగ్యముల మాటా మాటా పట్టింపులు, నిస్సత్తువ, ఇంటా బయట కలహాలు, కోపతాపాలు, మాట్లాడుకోవడం మానివేయడం. సోదరి సోదర వర్గ ద్వేషములు, విశేషమైన వ్యవహారములు తలకు చుట్టుకొనుట, కోర్టు, పోలీసు వ్యవహారములు ఇబ్బందులు. పిల్లల యొక్క చదువుల కొరకు లేనిపోని ఇబ్బందులు పడుట. పిత్రార్జితం కలిసి రాకుండుట. ఆరోగ్యం నందు తగు జాగ్రత్త అవసరం. గ్రంథరచయితలకు, గాయకులకు, కవులకు సాధారణంగా ఉండును. దేవాదాయ శాఖ, మెడిసిన్, రెవెన్యూ ఉద్యోగస్తులకు ప్రమోషన్లు. కిరాణ, కొబ్బరి వ్యాపారస్తులకు అనుకూలం.

**దోష పరిహారం :** గురు, శని, రాహువు, కేతువు గ్రహములకు జప, తర్పణ, హోమాదులు జరిపించి గురునికి 1 1/4 శనగలు, శనికి తిలదానం, రాహువుకి 1 1/4 మినుములు, కేతువునికి 1 1/4 ఉలవలు దానం చేయాలి. గురు, శనివారముల నియమాలు పాటించాలి. గృహము నందు సుందరకాండ, మన్యుసూక్త పారాయణ, లలితా పారాయణం జరిపించుట వలన దోష తీవ్రత తగ్గి ఫలితం కలుగును. గృహము నందు ఉదయం. సాయంత్రం దీపం పెట్టి రెండు వేళలా పూజ చేసిన శుభఫలితం కలుగును. సిద్ధి రక్షను ధరించుట యోగదాయకం.

**మార్చి:** ఉదర సంబంధిత అనారోగ్యములు ఋణములు చేయుట, గృహము నందు శుభకార్యాలు పాత మిత్రులు దూరమగుట బంధువులతో విందు వినోదాల యందు పాల్గొనుట. అధిక ధనవ్యయం అకారణ కలహములు, వ్యసనముల యందు ఆసక్తి, ధర్మకార్యములు యందు నిర్లక్ష్యం, మనఃచాంచల్యం.

**ఏప్రియల్:** మనఃశాంతి లేకుండుట, అపనిందలు, కుటుంబ వ్యవహారాలరీత్యా శుభమూలక ధనవ్యయం, ఆదాయం మించి ఖర్చు, మాట్లాడితే విరోధాలు, స్థిరాస్తి అమ్మకాలు మేనమామతో మాటా మాటా పట్టింపులు, బంధు వర్గం వారిలో చిన్న చిన్న విషయాలలో పట్టింపులు.

**మే:** కార్య ఆటంకాలు, వృధాప్రయాణాలు, అకాల భోజనాలు, ప్రయాణముల యందు జాగ్రత్త అవసరము, సర్పభయం ప్రతి పనికి వాయిదా వేయుట, ఇతరులను నిందించుట, ఇంటా బయట విరోధాలు, విందు వినోదాల యందు పాల్గొనుట, స్త్రీల యందు జాగ్రత్త అవసరము.

**జూన్:** శుభా మిశ్రమము, మీ మాట వల్ల ఇతరులు మోసపోవుట, ధనాదాయం బాగుండును, వృత్తిపరమైన మార్పులు అనుకూలం, వృధా ప్రయాణాలు, బంధు సఖ్యత, స్నేహితులకు మీకు మాట మాట పట్టింపులు, నరఘోష అధికంగా ఉ ండును, శతృభయం.

**జూలై:** మీ మాటకు ఎదురు లేకుండుట, అనుకోని విధంగా ధనము చేతికందుట, వాహన గృహ లాభములు, ప్రయత్నించిన కార్యములు అనుకూలించుట, భార్య పిల్లలతో స్వల్ప విరోధాలు, సంతాన ఒత్తిడి, అన్నదమ్ముల మధ్య మనస్పర్థలు, కోర్టు వ్యవహారములు వాయిదా పడుట, ఇంటి పనులు ఆలస్యంగా పూర్తి అగుట.

**ఆగష్టు:** అనుకున్న పనులు పూర్తి అగుట, మనస్సు యందు ఉత్సాహము, తేజస్సు, దైవకార్యముల కొరకై ధనం, కాలం వెచ్చించుట, వ్యసనముల కొరకై ధనము వెచ్చించెదరు, గృహ నిర్మాణాది పనులు ప్రారంభం చేయుట, తీర్థ యాత్రలు చేయుట, పెద్ద వారి యందు భక్తి, గొప్ప వారితో పరిచయాలు.

**సెప్టెంబరు:** ఆదాయం తగ్గును, ఇంటి యందు అనారోగ్యం, వృధా ఖర్చు, శారీరక శ్రమ అధికం, కోపము, చికాకులు, శుభకార్యములు కలసి రాకుండుట, అభిప్రాయ భేదాలు, కీళ్ళ నొప్పులు, కోర్టు తగాదాలు, బంధువుల రాకపోకలు, భార్య తరపు వారితో స్వల్ప విరోధాలు.

**అక్టోబరు:** కోర్టు వ్యవహారాలలో చిక్కులు తీరుట, పెద్దవారితో పరిచయాలు ఏర్పడుట, కార్యసిద్ధి, గృహాలంకరణకై ధనము ఖర్చు చేయుట, తీర్థయాత్రలు, ఇంటా బయట, గౌరవము, నూతన మిత్రుల కలయిక, ఋణము తీర్చగలరు, కాంట్రాక్టుదారులకు అనుకూలము, ఇంటి యందు శుభకార్యములు.

**నవంబరు:** నూతన పెట్టుబడులు అనుకూలించుట, ఇంటియందు నూతన వస్తువులుకొనుట, ధనాదాయం బాగుండును. పెట్టుబడులు అనుకూలించును. సంఘం నందు గౌరవము, భూసంపాదన, ఏదోవిదంగా ధనము చేతికి అందుట, గృహమున శుభకార్యములు

**డిసెంబరు:** తోబుట్టువులతో విరోధములు, భూమి తగాదాలు, ఇతరులపై రోజూ కోపము అధికమగుట, స్థాన మార్పులు, ఇంటా బయట విరోధాలు, అత్తవారితో తగాదాలు, మనోనిబ్బరం, ధనం నిల్వ లేకుండుట, వాహన ప్రమాదములు.

**2019 జనవరి:** మీ మాటకు ఎదురు లేకుండుట, కోర్టు వ్యవహారములు తీరుట, పెద్దవానితో పరిచయాలు, గృహలంకరణపై ధనము ఖర్చు చేయుట, ఇంటా బయట గౌరవము, పాత మిత్రుల కలయిక, ఋణాలు తీర్చుట, వృత్తిపరమైన మార్పు లనుకూలం.

**ఫిబ్రవరి:** ఎంతటి కార్యమైనా సులువుగా పూర్తి చేయగలరు, చేయు వృత్తి యందు అభివృద్ధి, నూతన పరిచయాలు, కొత్త వ్యాపారములకై శ్రీకారం చేయుదురు. గత రెండు మాసముల నుండి పెండింగ్ పనులు పూర్తి అగుట, రాజీలు చేయుదురు, నూతన వాహనప్రాప్తి.

**మార్చి:** మాట్లాడితే విరోధాలు, ఇంటా బయటా భయాందోళనలు ధనవ్యయం అధికము, ఋణములు చేయుట, కార్యహాని, మిత్రుల సహాయ సహకారములు అందుట. భార్యకు స్వల్పఅనారోగ్యము, ప్రతి పనియందు అలసట, అధికారుల ఒత్తిడి, కలహములు అధికము, వృత్తియందు స్వల్ప అనుకూలం.



# ధనూరాశి

మూల 1, 2, 3, 4 పా॥
పూర్వాషాఢ 1, 2, 3, 4 పా॥
ఉత్తరాషాఢ 1 పా॥

ఆదాయం : 5, వ్యయం : 5, రాజపూజ్యం : 1, అవమానం : 5

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 3**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

మూల నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 7, అదృష్ట రత్నం వైఢూర్యం
పూర్వాషాఢ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 6, అదృష్ట రత్నం వజ్రము
ఉత్తరాషాఢ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు.

మూల నక్షత్ర స్త్రీలు వైఢూర్యం ఎడమచేయి చిటికెన వ్రేలునకు, పురుషులు కుడిచేయి చిటికెన వ్రేలునకు, పూర్వాషాఢ నక్షత్ర స్త్రీ, పురుషులు వజ్రము కుడిచేయి చూపుడు వ్రేలునకు, ఉత్తరాషాఢ నక్షత్ర స్త్రీ, పురుషులు కెంపు కుడిచేయి ఉంగరపు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభసమయమున ధరించుటశుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11వ తేదీ వరకు ఏకాదశ స్థానమున తులారాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు ద్వాదశ స్థానమున వృశ్చికరాశి యందు సంచరించును. రాహు, కేతువులు 2019 మార్చి 7వరకు రాహువు అష్టమ స్థానమున కర్కాటక రాశి యందు కేతువు ద్వితీయ స్థానమున మకరరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకు రాహువు సప్తమ స్థానమున మిధునరాశి యందు కేతువు జన్మరాశి స్థానమున ధనూరాశియందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురుడు ఏకాదశ ద్వాదశ స్థానముల యందు, శని ఏలినాటి శనిగా జన్మరాశి యందు రాహువు అష్టమ సప్తమ రాశుల యందు, కేతువు ద్వితీయ, జన్మరాశుల యందు సంచారం చేయుట వలన గురు కేతువులు యోగప్రదంగా, శని, రాహు అవయోగప్రదులుగా ఉండుట వలన ఈ సంవత్సరం ఈ జాతకులకు శుభాశుభ మిశ్రమముగా ఉండును. ప్రారంభం నుండి 7 మాసములు గురుడు, కేతువుల వలన కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. మంచి ఆరోగ్యము, మాటకు ఎదురులేకుండుట. మీ చుట్టూ ఉన్న పరివారం విలువనిచ్చును. వెళ్ళిన ప్రతి వ్యవహారం జయము నిచ్చుట. సుఖసంతోషాలతో ఉండుట. విరోధులు నశించుట. శత్రుబలం తగ్గి మీ బలం పెంపొందుట. ధర్మకార్యములు కొరకై ధనం వెచ్చించుట, తీర్థయాత్రలు,

యజ్ఞయగాదులు నిర్వర్తించుట. గృహమున మంగళ ప్రదమైనటువంటి పూజలు, నోములు నోయుట. వివాహాది శుభకార్యములు, గృహ నిర్మాణదులు చేపట్టుట లేక భూసంపాదన పెరుగుట, తేజస్సు పెరుగుట. విశేషమైన ధనలాభములు. తలచిన దానికన్నా ధనం వృద్ధిరేటు పెరుగుట. ఉన్నత పదవులు లేక ఉద్యోగస్తులకు ప్రమోషన్లు, మాటకు ఎదురు లేకుండుట, చిరునవ్వుతో సంతోషంగా ఉండుట, విద్యార్థులకు ఉత్తీర్ణత శాతం పెరుగును. వ్యవసాయదారులకు మొదటి పంటి లాభించును. సంతాన లాభములు, విందు, విలాస కార్యములలో పాల్గొనుట, నూతన బాంధవ్యాలు పెరుగుట. ద్వితీయార్థం మిగిలిన మాసములు గురుడు బలం తగ్గుట వలన గురు, శని, రాహువులను ముగ్గురును కూడా పాపస్థానముల యందు ఉన్నందున ప్రతీ పని చాలా చిత్రంగా ఇబ్బంది పెట్టుట. ముఖ్యమైన పనులు రెండవ వ్యక్తి యొక్క ఆలోచన తీసుకొని వ్యవహారం చేయడం వలన ఇబ్బంది పడాలి. శుభకార్యం నిమిత్తం చేసిన ఋణం ఇబ్బంది పెడుతుంది. గుండెదడ, ఆయాసం, నేత్ర, ఉదర, నరాల సంబంధిత అనారోగ్యం, బాకీలు వసూలు రాకుండుట, అవమానములు, శతృభయం, మిత్రులు శత్రువులుగా మారును. ఏ విషయం అయిననూ తలచినది ఒకటి అయ్యేది ఇంకొకటి. మానసిక పరమైన ఇబ్బందులు ఏదుర్కొనుట, రాజకీయ నాయకులకు అనుమాన, అవమానములు. వ్యవసాయదారులకు 2వ పంట కలసి రాకుండుట. డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు రెండవ ధన సంబంధిత వ్యవహారానికి వెళ్ళి గౌరవ మర్యాదలు తగ్గి ఇబ్బంది పడుట. నిల్వచేయు వ్యాపారులకు ఇది అనుకూల సమయం.

**దోష పరిహారం (శాంతి) :** ఈ రాశి వారు శని, రాహువులకు జప, తర్పణ, హోమాదులు జరిపించి శనివారం శివాలయ దర్శనం చేసి ఆ రోజు నియమంగా ఉండాలి. రావి చెట్టు ప్రదక్షిణలు, బెల్లం నివేదన చేయుటమంచిది. మాసశివరాత్రి, సంకష్టహర చతుర్థి రోజున శివాలయమను అభిషేకములు, గణపతికి దుర్వార్చన జరిపించుట వలన దోషం తగ్గును. అక్టోబరు 11 తరువాత గురు గ్రహానికి జపదానాదులు జరిపించి గృహమున చండీ హోమం జరిపించి అన్నశాంతి చేయుట శుభదాయకం. ప్రతీరోజు లలితా విష్ణు సహస్రనామ పారాయణ చేయుట అత్యంత యోగదాయకం. నరఘోష యంత్రం స్థాపించుట మంచిది.

**మార్చి:** వ్యర్థప్రయత్నాలు, మానసిక అశాంతి, శరీరము నందు బాధ, అనారోగ్యము, అజీర్ణవ్యాధి, శత్రువులతో భయం, అకాల భోజనము, ఆధ్యాత్మిక చింతన తగ్గుట, అందరితో మాటలు పడుట, పనిచేయు చోట్ల మనకంటే పెద్దవారితో మాటా మాటా పట్టింపులు, చేయు వ్యాపారమునందు చికాకులు.

**ఏప్రియల్:** మంచి వారితో స్నేహాలు, ధనధాన్యాలు వృద్ధియగుట, అధికారులతో పరచయాలు, బంధుమిత్రాదులతో సఖ్యత, పేరు ప్రఖ్యాతలు, ఆడంబరాలు అధికమగుట, మనస్సున సంతోషము, తలచని పనులు పూర్తి అగుట.

**మే:** ధనమునకు లోటు ఉండదు, కుటుంబ సౌఖ్యము, స్థానచలనముల వలన అధిక ధనవ్యయము ఇష్టం లేని పనులు చేయవలసి వచ్చును. బంధువులతో ఇబ్బందులు, శిరోబాధ, అధికారుల ఒత్తిడి, ఉద్యోగముల యందు విరోధాలు, జాయింటు వ్యాపారస్తులకు భిన్నాభిప్రాయాలు.

**జూన్:** భార్యతో స్వల్ప విరోధములు, వ్యసనకరమైన మాటలు వినుట, శత్రువులతో వాదము, ప్రయాణములు కలసి రాకుండుట, శరీరం నందు అనారోగ్యము, భోజనము ఇంపు కాకుండుట, మనస్సున చెడు ఆలోచనలు, అపకీర్తి స్త్రీ వ్యామోహం.

**జూలై:** సోమరితలము కలిగి ఉండుట, స్నేహితులతో ఇబ్బందులు, విపరీత ధన వ్యయము, అనుకొనిన పనులు పూర్తికాకుండుట, వృత్తి ఆటంకములు, అనుకోని ధన నష్టములు, సేవకుల వల్ల మాటలు పడుట, ప్రయాణముల యందు ఆటంకములు.

**ఆగష్టు:** మిత్రులతో మనస్పర్థలు, రాజకీయ నాయకుల పరిచయాలు, చేయు పనులయందు లాభము లేకుండుట, కార్యముల కొరకై అనుకోని ఖర్చులు. పై అధికారులతో ఇబ్బందులు, బంధుమిత్రాదులతో మనస్పర్థలు, జ్ఞాపకశక్తి లోపించుట.

**సెప్టెంబరు:** వేళదాటిన భోజనములు, శరీరంనందు బాధ, మనస్సున విపరీత ఆలోచనలు, బంధుమిత్రాదులతో విరోధములు, చోరభయము, ఆయుదముల వలన దెబ్బలు తగులుట. మనస్సున భయాందోళనలు కృషి లేకుండుట, అన్ని కార్యములు విఘ్నమగుట.

**అక్టోబరు:** మీ వద్ద పనిచేయు వారితో ఇబ్బందులు, వ్యాపార ఒడిదుడుకులు, మీ భాగస్వామితో సఖ్యత, శ్రమకు తగ్గ ఫలితము, విదేశీ ప్రయాత్నములు కలసి వచ్చుట, తేజస్సు పెరుగుట, నూతన వ్యక్తుల పరిచయాలు, ఇష్టము సిద్ధించుట, వస్తు వస్త్ర లాభము.

**నవంబరు:** తేజస్సు తగ్గుట, ద్రవ్య లాభము, మనస్సున సౌఖ్యము, స్త్రీ వ్యామోహము, ప్రయత్నించిన కార్యములు కలసి వచ్చుట, పెద్ద వారితో పరిచయాలు, నూతన వస్తు, వస్త్రములు కొనుట, దైవ సంబంధిత కార్యములలో పాల్గొందురు. ఇంటి యందు సఖ్యత.

**డిశంబరు:** తలకు సంబంధమైన అనారోగ్యములు, వేళదాటిన భోజనము, బంధు మిత్రాదులతో విరోధములు, స్థానచలనములు, చుట్టములతో ద్వేషము, శరీరమునకు అనారోగ్యము , అనవసరపు ప్రయాణములు, వాత సంబంధిత అనారోగ్యములు భయాందోళన.

**2019 జనవరి:** ఈ మాసము శుభప్రదముగానే ఉండును. ఉన్నతాధికారుల ప్రోత్సాహం లభించుట. ఇంటి యందు శుభకార్యములు కలసి వచ్చుట, మానసిక ధైర్యము చేయు వృత్తి, వ్యాపార ఉద్యోగముల యందు లాభములు చేకూరుట, ఆభరణములు కొనుగోలు చేయుట.

**ఫిబ్రవరి:** స్వబుద్ధిచే ప్రారంభించిన కార్యములు సిద్ధించుట, ధనధాన్యాభివృద్ధి, సంతోషము, మనస్సున ధైర్యము, విందులు, వినోదముల యందు పాల్గొనుట, ధర్మకార్యములు కొరకై ధనము ఖర్చు చేయుట, సంతాన లాభములు, గృహ నిర్మాణాదులు ప్రారంభించుట, ఇంటి యందు శుభకార్యములు.

**మార్చి:** ఈ శుభాశుభ మిశ్రమము, చేయు వ్యాపారాదులు అనుకూలించుట, శ్రమకు తగిన ఫలితము, దుర్మార్గులతో సహవాసము, బంధువులతో స్వల్ప విరోధములు, స్వప్నమున పీడకలలు వచ్చుట, తలనొప్పి.



# మకరరాశి

ఉత్తరాషాఢ 2, 3, 4 పా॥
శ్రవణం 1, 2, 3, 4 పా॥
ధనిష్ఠ 1, 2 పా॥

**ఆదాయం : 8, వ్యయం : 14, రాజపూజ్యం : 4, అవమానం : 5**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 8**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

ఉత్తరాషాఢ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 1, అదృష్ట రత్నం కెంపు
శ్రవణా నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 2, అదృష్ట రత్నం ముత్యము
ధనిష్ఠ నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడం.

ఉత్తరాషాఢ నక్షత్ర స్త్రీ పురుషులు కెంపు కుడిచేయి ఉంగరపు వ్రేలునకు, శ్రవణా నక్షత్ర స్త్రీ, పురుషులు ముత్యమును కుడిచేయి ఉంగరపు వ్రేలునకు, ధనిష్ఠ నక్షత్ర స్త్రీ, పురుషులు పగడం కుడిచేయి ఉంగరపు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11వ తేదీ వరకు దశమ స్థానమున తులారాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు ఏకాదశ స్థానమున వృశ్చికరాశి యందు సంచరించును. శని ఈ సంవత్సరం అంతయూ ద్వాదశ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు, కేతువులు 2019 మార్చి 7వరకు రాహువు సప్తమ స్థానమున కర్కాటక రాశి యందు, కేతువు జన్మరాశి మకరరాశి యందు సంచరించును. తదుపరి సంవత్సరాంతం వరకు రాహువు షష్ఠమ స్థానమున మిథునరాశి యందు, కేతువు ద్వాదశ స్థానమున ధనూరాశియందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురు, శని, రాహు, కేతువులు గురుడు దశమ ఏకాదశ స్థానముల యందు, శని ఏలినాటి శని ద్వాదశ రాశిగా ఉన్నందున రాహువు సప్తమ షష్ఠమ రాశుల యందు, కేతువు జన్మరాశి ద్వాదశముల యందు ఉన్నందున ఈ సంవత్సరము సామాన్య ఫలములు. కొన్ని కొన్ని వ్యవహారముల యందు జాగ్రత్తగా వ్యవహరించాలి. నిద్రలేమి, మానసిక ఆందోళన, స్థాన చలనములు, తేజస్సు తగ్గుట, ధన నాశనం. వ్యవసాయం అనుకూలించక పోవుట, ధన నష్టములు, సొంత మనుష్యులతో విరోధములు. శని ద్వాదశ రాశి యందు ఉన్నందున అవమానములు, మనస్సున ఏదో తెలియని ఆందోళన చేయు వృత్తి, వ్యాపార, వ్యవహారములు అనుకూలించకపోవుట, నష్టపోవుట. భోజనం ఇంపుకాక ఇంటి యందు కలహములు. రాహువు గ్రహము వలన పరాక్రమము అధికమగుట, జ్ఞాపకశక్తి మందగించుట, అనవసరపు

ప్రయాణములు. చేతులు, కాళ్ళకు సంబంధిత అనారోగ్యములు లేక యాక్సిడెంట్లు. కేతువు గ్రహము వలన ఏదో ఒక అనారోగ్యముతో బాధపడుట. భార్యా బిడ్డల మధ్య విరోధములు. అక్టోబరు నెల నుండి గురుడు బలం పొందుచున్నందున అనుకూలంగా ఉంటుంది. సోదర వర్గం వారిచే నూతన ఆలోచనలు వారి వలన ధనము కలసి వచ్చుట. గృహం నందు వాస్తు మార్పులు చేయుట. పెద్దవారితో పరిచయాలు. ప్రయాణములు కలసి వచ్చుట. సంతానం లేని వారికి సంతానం. ఉద్యోగస్తులకు అంతంత మాత్రం. నూతన పెట్టుబడులు, వ్యాపారం ఆచితూచి అడుగువేయాలి. వ్యవసాయదారులకు 2వ పంట లాభించును. నూతన ప్రముఖ వ్యక్తులతో స్నేహం లాభించుట. స్థిరాస్తి, అడ్డుపెట్టి చేయు ప్రయత్నాలు కలసి వచ్చుట. భార్య భర్తల మధ్య అన్యోన్యం, ఉద్యోగస్తులకు అనుకూలమైన ప్రదేశాలకు ట్రాన్స్‌ఫర్‌లు, ప్రమోషన్లు , వాహనలాభం. ఋణవిముక్తి కొద్ది కొద్దిగ జరుగుట. ఆధ్యాత్మిక, యోగా వంటి కార్యక్రమములో పాల్గొనుట మంచిది. దూరదేశంలో ఉన్నవారు స్వస్థలమునకు వచ్చి నూతన వ్యాపారం చేయుట మంచిది. విద్యార్థులకు దూరదేశ విద్య అనుకూలం. విమానయాన సంస్థలో పనిచేయు వారికి జాగ్రత్త అవసరం. గృహ నిర్మాణ కాంట్రాక్టర్లకు కలసి వచ్చును. ముఖ్యంగా చేయవలసిన పనుల యందు సోమరితనం కలిగి ఉందురు. అపోహలు, విపరీతమైన కోపం, తిట్లు మానసిక ఆందోళన వలన ముఖ్యమైన వ్యవహారములు కోల్పోవుట తరువాత బాధపడుట.

**దోష పరిహార శాంతి :** ఈ రాశి వారు గురు, శని, కేతువులకు తగిన శాంతి జరిపించాలి. మంగళ, గురు, శనివారములు నియమాలు పాటించి శివాలయమున రుద్రాభిషేకములు జరిపించాలి. గురువారం 1 1/4 శనగలు, మంగళవారం 1 1/4 ఉలవలు, శనివారం తిలదానం మరియు 1 1/4 మినుములు దానం చేయాలి. పంచాక్షరి సంపుటి, గురు గ్రహ జపం 16000, ఖడ్గమాల పారాయణం, దుర్గాసూక్త పారాయణం జరిపించాలి. ప్రతీ మంగళవారం 11వ వారములు అమ్మవారిని నియమంగా పూజించి ఏకభుక్తం చేసి అమ్మవారిని ఉదయం, సాయంత్రం పూజించి పులిహోర చేసి ప్రసాదం పంచి పెట్టండి. అమ్మవారి అనుగ్రహానికి పాత్రులుకాగలరు. శ్రీయంత్రరక్ష ధరించుట వలన కుటుంబ సౌఖ్యం కలుగును.

**మార్చి:** కోర్టు వ్యవహారం, చిక్కులు, ఆర్థిక ఇబ్బంది. మీకు కావలసిన వారు మోసము చేయుదురు. ఆలోచనలు పెద్దవారితో పరిచయములు ఉద్యోగ అనుకూలత, జయం, వ్యాపార వ్యవహారములందు అనుకూలం మంచి ధైర్యము గృహమార్పులు చేయుదురు, శుభకార్యములు ద్వారా ధనవ్యయం.

**ఏప్రియల్:** వివాహాది శుభకార్యముల కొరకై ఆలోచనలు, శుభకార్యములకు ధనవ్యయం, జాయింటుదారులతో ఇబ్బందులు, రాజకీయ నాయకులతో పరిచయములు, పాత మిత్రుల కలయిక సంతోషాన్ని ఇచ్చును. అవసరానికి ఏదో విధంగా ధనం చేతికి అందును. అనుకున్న పనులు నెరవేరును.

**మే:** ఈ నెల శుభాశుభ మిశ్రమంగా ఉండును. గృహ మార్పులు ప్రయత్నించిన పనులు పూర్తియగుట. నూతన వస్తు వస్త్రములను కొనుట, అధికారుల ఒత్తిడి పెరుగుట, ఋణములు అతికష్టం మీద తీరుట.

**జూన్:** మాట్లాడితే విరోధాలు, మనస్సున భయం, అధికారుల ఒత్తిడి, స్నేహితుల వల్ల మోసపోవుట, వృత్తి యందు స్వల్ప లాభముల, తొందరపాటు స్వభావం వల్ల ఇబ్బందులు, వ్యాపారం నందు స్వల్ప మార్పులు చేయుదురు. వృత్తిరీత్యా అధికారుల ఒత్తిడి, ఋణములు అతి కష్టం మీద తీరుట.

**జూలై:** వ్యాపారం నందు స్వల్ప లాభములు, వంశ అభివృద్ధి, స్త్రీ సహాయము, ప్రయత్నించిన కార్యములు నెరవేరును. దైవ కార్యముల యందు పాల్గొనుట, తీర్థయాత్రలు చేయుట, వాహన యోగము, వ్యవసాయంలో ధన లాభములు, పెద్దవారి స్నేహములు, నూతన స్త్రీ పరిచయం.

**ఆగష్టు:** ఇంటి యందు అనారోగ్యములు, తరచూ వైద్యుని సంప్రదించుట, మధ్యవర్తిగా ఉన్న పనుల యందు ఇబ్బందులు, కోర్టు తగాదాలు, చెడు కలలు, మీరు నమ్మిన వారి వల్ల ఇబ్బందులు, మనస్సున ఆందోళన, భార్యతో కలహములు, వ్యాపారం నందు స్వల్ప లాభములు.

**సెప్టెంబరు:** ఇంటి యందు శుభకార్యములు, అనుకోని ప్రయాణములు, పుణ్యక్షేత్ర దర్శనములు, ప్రతీ పనియందు ఆశించిన ఫలితములు లేకుండుట, విసుగుదల అధికము, దూర ప్రాంతము నుండి బంధువులు వచ్చుట, ధన వ్యయం.

**అక్టోబరు:** వ్యర్థ ప్రయత్నాలు, మానసిక అశాంతి, శరీరంనందు బాధ, అనారోగ్యము, అజీర్ణ వ్యాధి, శతృవులతో భయము, అకాలభోజనము, ఆధ్యాత్మిక చింతన తగ్గుట, అందరిచే మాటలు పడుట, పనిచేయు చోట్ల మనకంటే పెద్దవారితో మాటమాట పట్టింపులు, చేయు వ్యాపారం నందు చికాకులు.

**నవంబరు:** శుభాశుభామిశ్రముగా ఉండును. ఆదాయం, ఖర్చు సరిసమానంగా ఉండును. కుటుంబంలో పెద్దవారితో వాదోపవాదాలు, సంఘంలో గౌరవం పెరుగుట, గృహ ప్రయత్నాలు ఫలించక పోవుట, కొత్త కాంట్రాక్టులు కలిసివచ్చుట, ఫైనాన్స్ వ్యాపారస్తులకు స్వల్పలాభములు పెండింగ్‌లో ఉన్న పనులు పూర్తి ఆగుట.

**డిసెంబరు:** వివాహ ప్రయత్నాలు ఫలించుట, గృహమార్పులు చేయుట. మిత్రుల సహాయ సహకారాలు అందుతాయి. రాజకీయ ప్రాముఖ్యత పెరిగి అధికార లాభములు. కోర్టులో విజయం సాధించగలరు. అలంకార వస్తువులు కొనుట, గృహనిర్మాణాదులు, పాతబాకీలు వసూలు అగుట.

**2019 జనవరి:** ఏదో విధంగా ధనము చేతికి అందును, శతృవులతో వాదనలు, ఉద్యోగం నందు అవకతవకలు, వాహన లాభములు, తీర్థయాత్రలు చేయుట. ధాంభికము అధికమగుట, స్వల్ప ప్రజావ్యతిరేకత, ఫైనాన్స్ వ్యాపారస్తులకు పాతబాకీలు వసూలు అగుట. ఇంటి యందు శుభకార్యములు.

**ఫిబ్రవరి:** వివాహాది శుభకార్యముల కొరకై ఆలోచనలు, శుభకార్యములకు ధనవ్యయం జాయింటుదారులతో ఇబ్బందులు, రాజకీయ నాయకులతో పరిచయములు, పాతమిత్రుల కలయిక సంతోషాన్ని ఇచ్చును. అవసరానికి ఏదో విధంగా ధనం చేతికి అందును. అనుకున్న పనులు నెరవేరును.

**మార్చి:** ప్రతి పనియందు ఆటంకములు, ఆరోగ్య విషయమందు జాగ్రత్త అవసరము, రాజకీయ వ్యవహారములందు అనవసరపు ప్రయాణములు, కోర్టు తగాదాలు, మనస్సు నికరం లేకుండుట, ఆకర్షణ తగ్గుట, కీర్తి భంగపాటు, కుటుంబ సభ్యులతో కలహాలు, పెట్టుబడులు రాణించవు.



# కుంభరాశి

ధనిష్ఠ 3, 4 పా॥
శతభిషం 1, 2, 3, 4 పా॥
పూర్వాభాద్ర 1, 2, 3 పా॥

**ఆదాయం : 8, వ్యయం : 14, రాజపూజ్యం : 7, అవమానం : 5**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 8**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

ధనిష్ఠ నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 9, అదృష్ట రత్నం పగడము
శతభిషం నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 4, అదృష్ట రత్నం గోమేధికము
పూర్వాభాద్ర నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం

ధనిష్ఠా నక్షత్ర స్త్రీ పురుషులు పగడము కుడిచేయి ఉంగరపు వ్రేలునకు, శతభిషా నక్షత్ర స్త్రీ గోమేధికము ఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, పూర్వాభాద్ర నక్షత్ర స్త్రీ, పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు ధరించాలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11వ తేదీ వరకు భాగ్యస్థానమున తులారాశియందు తదుపరి సంవత్సరాంతం వరకు దశమ స్థానమున వృశ్చికరాశి యందు సంచరించును. శని ఈ సంవత్సరం అంతయూ ఏకాదశ స్థానమున ధనూరాశి యందు సంచరించును. రాహు, కేతువులు 2019 మార్చి 7వరకు రాహువు షష్ఠమ స్థానమున కర్కాటక రాశి యందు కేతువు ద్వాదశ స్థానమున మకరరాశి యందు సంచరించును తదుపరి సంవత్సరాంతం వరకు రాహువు పంచమ స్థానమున మిధునరాశి యందు కేతువు ఏకాదశ స్థానమున ధనూరాశియందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురుడు నవమ దశమ రాశులయందు, శని లాభ రాశి యందు, రాహువు షష్టమ పంచమి స్థానముల యందు, కేతువు ద్వాదశ ఏకాదశ స్థానముల యందు సంచారం చేయుట వలన ఈ సంవత్సరం చాలా యోగవంతంగా ఉన్నది. ధన లాభములు పెంపొందుట. తన ఆచార వ్యవహారముల ప్రకారం ఇంటి యందు శుభకార్యం, నూతన గృహ లాభం, షడ్ రుచులు కలిగిన భోజనం, విందు, వినోదాలు, విలాసాలు, నూతన వ్యక్తుల పరిచయాలు, ఆడంభర జీవితం. అధికారులతోను, రాజకీయ నాయకులతోను మంచి తత్సంబంధం కలిగి ఉండుట. ప్రముఖ వ్యక్తులతో పరిచయాలు నూతన స్త్రీ పరిచయం, మంచి ఆరోగ్యం, పుత్రికా పుత్రుల వలన

విశేషమైన లాభం. పిల్లలకు మంచి ఉద్యోగాలు మనస్సు చాలా నిర్మలంగా ఉండుట. తలచిన ప్రతీ పని అనుకూలించుట, విశేషమైన దైవదర్శనాలు, నూతన వస్తు, ఆభరణ లాభములు. మంచి ధైర్యముతో కూడిన ఆలోచనలు అనుకూలించుట. మంచి యోగవంతమైన జీవితం కలిగి ఉండుట. ఇంటా బయట కీర్తి పెంపొందుట. గో వ్యవసాయ పాడి పంటలు అభివృద్ధి బంధు మిత్రాదుల వలన సౌఖ్యం, సహాయ సహకారం పట్టిందల్లా బంగారమా అన్నట్లు ఉండును. అనుకున్న కార్యక్రమము పూర్తి అగుట, ఆగి ఉన్న పనులన్నియు పూర్తగుట, విలువైన అలంకార వస్తువులు కొనుట. శత్రుమూలకంగాను ధనలాభం, విదేశీ యాత్రలు కలసి వచ్చుట. రెండు సంవత్సరముల నుండి దూరదేశాలలో ఉన్నవారికి ఈ సంవత్సరం బాగా కలసి వచ్చి విశేషమైన ధనలాభం. స్థిరాస్తులు కొనుగోలు చేయుదురు. పెండింగ్‌లో ఉన్న పలులు అనుకూలించుట, రాజకీయ రంగంలో ఉన్నవారికి రాజయోగం. పాత బాకీలు వసూలగుట. విద్యార్థులకు అన్ని విధాల యోగకాలం, ఫైనాన్స్, వస్త్ర, కిరాణ, ఫాన్సీ వ్యాపారులకు మంచి అనుకూలం, సినీ నిర్మాణ రంగం వారికి మంచి లాభపాటి, ప్రవేటు రంగంలో పని చేయువారికి ఆదాయం పెరుగుట. వైద్య రంగంలో ఉన్నవారికి అనుకూలం. క్రీడా రంగాల వారికి కీర్తి ప్రతిష్టలు. నిరుద్యోగులకు ఉద్యోగవకాశాలు. మార్బుల్, స్టేషనరీ, సిమెంటు, ఇనుము, పాలు, పండ్లు, పౌల్ట్రీ వ్యాపారంలో దిగ్విజయ మంచి లాభాలు. వాహనము, స్టూడియో, వ్యాపారము అభివృద్ధి. కేతు గ్రహం వలన స్వల్ప విచారం, అధికారుల ఒత్తిడి, అనవసరపు ప్రయాణం.

**దోష పరిహారం-శాంతి :** ఈ జాతకులు కేతు గ్రహమునకు 7 వేలు జపం జరిపించాలి. తర్పణ, అభిషేక హోమములు జరిపి 1 1/4 కేజీల ఉలవలు దానం ఇవ్వాలి. ప్రతిదినం ఖడ్గమాల పారాయణ సర్వ శోభాయమానం, నరఘోష అధికంగా ఉన్నందున ఇంటి యందు చండీ హోమం జరిపించాలి. నరఘోష యంత్రం స్థాపించుట వలన సకల శుభయోగదాయకం.

**మార్చి:** రాజకీయ నాయకుల మన్నన, స్వబుద్ధిచే ప్రారంభించిన పనులు నెరవేరుట, ధన ధాన్యాభివృద్ధి, సంతోషము, మనస్సున ధైర్యము, విందులు యందు పాల్గొనుట, ధర్మకార్యముల కొరకై ధనము ఖర్చు చేయును. సంతాన లాభము గృహ నిర్మాణాదులు ప్రారంభించుట.

**ఏప్రియల్:** ధనలాభములు, మనస్సున తలచిన కార్యములు వెంటనే నెరవేరుట, విదేశీ ప్రయాణములు, వేళదాటిన భోజనములు, మిత్రులతో మాటా మాటా పట్టింపులు, కోర్టు వాయిదాలు అనుకూలం. నూతన గృహ నిర్మాణాది పనులు కలసి వచ్చుట. పెండింగ్ ఉన్న పనులు నెరవేరుటవల్ల మనసు నందు సంతోషము.

**మే:** వ్యాపారులకు ధనలాభం, ఇంటి యందు శుభకార్యములు, విందు వినోదముల యందు పాల్గొనుట, కీర్తివృద్ధి, ఉత్సాహంగా ఉండుట, ప్రయత్నించిన కార్యములు నెరవేరుట, భార్యతో స్వల్ప విరోధాలు. ఇంటియందు స్వల్ప అనారోగ్యములు, భార్య తరపున వారితో మాటా మాటా పట్టింపులు. శుభకార్యములలో పాల్గొందురు.

**జూన్:** నూతన వస్తు వస్త్రములు కొనుగోలు చేయుట, మనస్సు నిర్మలత్వం, దైవ కార్యముల యందు పాల్గొనుట, తీర్థయాత్రలు చేయుదురు. ఏ పనైనా ధైర్యంగా చేయుట, నూతన స్త్రీ పరిచయాలు, సోమరితనం కలిగిఉండుట. అవమానాలు ఎదురగును, కులాచార ప్రకారం దైవకార్యములు చేయుట.

**జూలై:** చెడు తలంపులు, చెడు స్నేహములు చేయుట, శతృవులతో వాదములు, ప్రయాణాల రీతిలో ధనవ్యయం దుఃఖ వార్తలు వినుట, పాపకర్మల యందు ఇష్టత, విపరీతమైన కోపము, స్వల్పఅనారోగ్యము, శతృవృద్ధి నూతన గృహ నిర్మాణాదులు ప్రారంభం చేయుదురు.

**ఆగష్టు:** వివాహాది శుభకార్యములకై ఆలోచనలు, శుభమూలక ధనవ్యయం, జాయింటు వ్యాపారస్తులకు కొంచెం ఇబ్బందులు, రాజకీయ నాయకులతో పరిచయాలు, పాత మిత్రుల కలయిక, అవసరానికి ఏదో విధంగా ధనం చేతికి అందును. ఋణములు తీరుట.

**సెప్టెంబరు:** ప్రయత్నించిన కార్యములు సఫలీకృత మగును, సోమరితనము అధికము, బుద్ధిమందత్వం, బంధు వర్గం వారితో విరోధాలు, గొప్ప ఆపద నుండి బయట పడుట, స్నేహ మూలక ధనవ్యయం, అనారోగ్యరీత్యా ధనవ్యయం మన కింద పనిచేసే వారివల్ల ధనలాభం, ఇష్టం సిద్ధించును.

**అక్టోబరు:** పాతఋణములు తీరుట, పాతమిత్రుల కలయిక, కీర్తి వృద్ధి, స్త్రీ మూలక లాభములు, జ్ఞాపకశక్తి తగ్గుట, శిరోవేదన, భార్య భర్తల మధ్య అన్యోన్యత, రాజకీయ గౌరవం పెరుగుట,

**నవంబరు:** ఋణములు చేయుట, నూతన వ్యాపారముల కొరకై ఆలోచనలు, వృత్తి ఉద్యోగాదులు సామాన్యము, తొందరపాటు నిర్ణయాలు చేయుట, పుణ్యక్షేత్ర దర్శనాలు చేయుట. రాజీలు చేయుట, ఉద్యోగ ప్రయత్నములు కలసి వచ్చును, ఉద్యోగ లాభము.

**డిసెంబరు:** గృహ మార్పులు ప్రయత్నించిన కార్యములు సిద్ధించుట, పూర్వం పెట్టిన పెట్టుబడులు లాభం వచ్చును, కోర్టు వ్యవహారముల యందు విజయం సాధించగలరు. ప్రమోషన్లు, అనుకున్న చోట్లకు బదిలీలు, గృహము నందు అలంకార వస్తువులు కొనుట, ఇంటి యందు శుభకార్యములు.

**2019 జనవరి:** ఈ నెల శుభాశుభ మిశ్రమముగా ఉండను. పాతబాకీలు తీర్చగలరు. అనవసరపు ప్రయాణాలు, ఇష్టము సిద్ధించుట, మనస్సు నిర్మలంగా ఉండును, సభాగౌరవాది మర్యాదులు, సన్మాదులు జరుగను. పరామర్శలు చేయుదురు, ఇంటా బయట సంతోష వాతావరణం కలిగి ఉండును.

**ఫిబ్రవరి:** వ్యవహారము నందు అపజయం, అనారోగ్య లోపములు, అధిక ధనవ్యయం శరీరం నందు ఏదో ఒక చోట నొప్పి ఉండును. నరాల బలహీనత, ఇరుగు పొరుగు వారితో స్వల్పవిరోధములు, ఉత్సాహం లేకుండుట, వ్యసనకరమైన మాటలు వినుట, తప్పులేకుండగా మాటలు పడుట.

**మార్చి:** అధిక శ్రమ, శరీరం నందు సోమరితనం, దుర్మార్గుల సహవాసం, వ్యసనములలోనగుదురు. నూతన స్త్రీ పరిచయాలు, భార్యతో స్వల్ప విరోధములు, ఇంటి యందు శుభకార్యముల రీత్యా ధనవ్యయం, అనుకోని ప్రయాణాలు, ఋణబాధలు, అకాల భోజనము.



# మీనరాశి

పూర్వాభాద్ర 4 పా॥
ఉత్తరాభాద్ర 1, 2, 3, 4 పా॥
రేవతి 1, 2, 3, 4 పా॥

**ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 3 అవమానం: 1**

**ఈ రాశి వారి అదృష్ట సంఖ్య 3**

**అదృష్ట సంఖ్యలు-రత్నములు**

పూర్వాభాద్ర నక్షత్రం వారికి అదృష్ట సంఖ్య : 3, అదృష్ట రత్నం పుష్యరాగం
ఉత్తరాభాద్ర నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 8, అదృష్ట రత్నం నీలము
రేవతి నక్షత్రం వారి అదృష్ట సంఖ్య : 5, అదృష్ట రత్నం పచ్చ.

పూర్వాభాద్ర నక్షత్ర స్త్రీ పురుషులు పుష్యరాగం కుడిచేయి చూపుడు వ్రేలునకు, ఉత్తరాభాద్ర నక్షత్ర స్త్రీలు నీలము ఎడమ చేయి మధ్య వ్రేలునకు, పురుషులు కుడిచేయి మధ్య వ్రేలునకు, రేవతి నక్షత్ర స్త్రీ, పురుషులు పచ్చ కుడిచేయి చిటికిన వ్రేలునకు ధరాంచలి. రత్న సంబంధిత గ్రహ జపములు జరిపించి ఉంగరములు శుభ సమయమున ధరించుట శుభదాయకము.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గురుడు అక్టోబరు 11 వరకూ అష్ఠమ స్థానమున తులారాశి యందు తదుపరి సంవత్సరాంతం వరకూ భాగ్యస్థానమున వృశ్చికరాశి యందు సంతరించును. శని ఈ సంవత్సరం అంతయూ ధశమ స్తానమున ధనూరాశి యందు సంచరించును. రాహు కేతువులు 2019 మార్చి 7 వరకూ రాహువు పంచమస్థానమున కర్కాటకరాశియందు కేతువు ఏకాధశ స్థానమున మకరరాశి యందు సంచరించును. తదుపరి సంవత్సరాంతం వరకూ కేతువు అర్థాష్ఠమ స్థానమున మిధునరాశియందు కేతువు దశమస్థానమున ధనూరాశి యందు సంచరించును.

ఈ రాశి స్త్రీ పురుషాదులకు గ్రహములన్ని పరిశీలన చేయగా గురుడు అష్టమ నవమ స్థానముల యందు, శని దశమ స్థానమున, రాహువు పంచమి అర్ధాష్టమ స్థానముల యందు, కేతువు ఏకాదశ, దశముల యందు ఉన్నందున, ఈ సంవత్సరం కేతుగ్రహం ఒకటే శుభదాయకం. శని ఈ సంవత్సరం అంతా అవయోగప్రదుడు. ఈ సంవత్సరం సామాన్యంగా ఉండును. ప్రథమార్థం గురుడు ప్రతీ పనియందు తెగింపు, కోపం, క్రూరమైన మాటలు వినుట, పలుకుట, గంభీరత తగ్గుట. శరీరం నందు తేజస్సు తగ్గుట. మనం పనిచేయు వారితో ఇబ్బందులు, భయము. ఋణ బాధ లేక మన వద్ద ధనం తీసుకున్న వారు ఇవ్వక ఇబ్బంది పెట్టుట. శని వలన మనస్సు ఏదో తెలియని ఆందోళన, దుఃఖం కలిగి ఉండుట. దుర అలవాట్లు

మరియు వృత్తి, వ్యాపారం, ఉద్యోగ వ్యవహారముల యందు ఆటంకములు. సమస్త కార్యములు ఏదురకు వెళ్ళకుండుట. తండ్రి కొడుకుల మధ్య విరోధము. ఏకాలమున భోజనం లేకుండుట. అందరికి పూజార్హుడై ఉన్ననూ ఇబ్బందులు అధికంగా ఉండును. ఇంట ఈగలమోత బయట పల్లకి మోత అన్న చందాన ఉండును. స్త్రీ మూలక భయప్రదం. ప్రయాణమందు విఘ్నములు. కాళ్ళు, కీళ్ళు, వెన్నుముక సంబంధిత బాధలు, నొప్పులు. ద్వితీయార్థం నుండి మరొక సంవత్సర కాలం వరకు చాలా యోగవంతంగా జాతకం నడుచును. ఉద్రేకత తగ్గించుకొనుట మంచిది. లోగడ పెండింగ్‌లో ఉన్న వ్యవహారము అనుకూలించుట. అనుకున్న సమయంలో ధనం చేతికి అందుతుంది. మనస్సున తలచిన కార్యములు సిద్ధించుట. సంఘమున ఉన్నతమైన అధికారం లభించుట. కీర్తి ప్రతిష్టలు పెరుగుట. పాత ఋణములు తీరుట. ధనాదాయం వృద్ధి. ధర్మకార్యం కొరకై ధనం ఖర్చు. ఆనందంతో కూడిన మనస్సు, భూగృహ, వాహనాదులు వృద్ధి స్థిరాస్తి కొనుగోలు చేయుట. ఇంటి యందు శుభకార్యం. పెద్దవారితో పరిచయాలు. భార్య తరపు వారితో స్వల్ప విరోధం. ప్రవేటు సంస్థలో పనిచేయు వారికి జీతం పెరుగుట. స్థిరత్వం పొందుట. విద్యార్థులకు అన్ని విధాల కలసి వచ్చును. శుభకార్యములకు హాజరు అగుట మిత్రులతో విందు, వినోదాలు. చేయు వృత్తి, వ్యాపారం, ఉద్యోగాలలో మంచి లాభములు. గత రెండు సంవత్సరాలుగా పడుతున్న ఇబ్బందులు పూర్తి అగుట.

**దోషపరిహారం** :ఈ రాశి వారికి గురుడు, శని, రాహుగ్రహములు దోషప్రదులు. దోషపరిహారమై గురునికి 16,000, శనికి 19,000, రాహువునకు 18,000 జప శాంతులు జరిపించాలి. గురునికి 1 1/4 శనగలు, రాహువునకు 1 1/4 మినుములు, శనికి తగు మాత్రం తిలలు దానం జరిపించాలి. ప్రతీ ఏకాదశి తిథి యందు నియమం పాటించి ఈశ్వరునికి అభిషేకాదులు జరిపించుట యోగదాయకం. ఇంటియందు సత్యనారాయణ వ్రతం జరిపించి అన్నశాంతి చేయాలి. దుర్గాష్టమి నుండి విజయదశమి వరకు అమ్మవారిని ఇంటియందున కలశమున పూజ చేయడం మంచిది. అమ్మవారిని పూజించి, అమ్మవారి కృపకు పాత్రులు కాగలరు. సిద్ధి రక్షను ధరించుట అత్యంత యోగదాయకం.

**మార్చి:** జీవనం సాఫీగా ఉండును. స్థిరాస్తి వృద్ధి, డాంభికము అధికంగా ఉండును. తీర్థయాత్రలు, ధర్మకార్యము కొరకై ధన వ్యయము, సాహస కార్యముల చేయుట, అధికారుల మన్ననలు పొందుదురు. పితృ సంబంధిత ఆస్తి కలసివచ్చును.

**ఏప్రియల్:** ఉద్యోగస్తులకు అనుకొన్న చోట్లకు బదిలాలు, చేయు వృత్తి యందు అభివృద్ధి, వ్యసనముల యందు ఆసక్తి, గౌరవప్రదమైన పదవుల పొందుట, పై అధికారుల మన్ననలు పొందుట, ఇంటి యందు శుభకార్యములు.

**మే:** పాత బాకీలు వసూలు అగుట, ఇష్టార్థ సిద్ధి, ధనాదాయం బాగుండుట, తీర్థయాత్రలు చేయుదురు. బంధుమిత్రాదులతో స్నేహ బాంధవ్యములు పెరుగుట, గృహలాభములు, ఎల్లచోట్ల జయము, గురుభక్తి, వర్తక వ్యాపారము నందు లాభము కలిగి ఉండుట. విదేశీ ప్రయాణములు కలసి వచ్చుట.

**జూన్:** ప్రతీ పనియందు ఆటంకములు, వేళదాటిన భోజనములు, భార్య బిడ్డలతో విరోధములు, ఇనుప వస్తువుల వలన గాయములు, ఉదర సంబంధిత జ్వరపీడలు, చెడు కలలు వచ్చుట, భార్య బంధువులతో విరోధాలు, ఇంటి యందు సుఖము లేకుండుట.

**జూలై:** నేత్ర బాధలు, విపరీత ధనవ్యయం, అన్ని కార్యములకు ఆటంక ములుగా ఉండును. అన్య స్థల జీవనము, అనుకోని సంఘటనలు, యాత్రలు కలసి రాకుండుట, శుభకార్యములు కలసి రాకపోవుట, పెద్ద వారితో స్నేహములు వికటించుట, ఋణములు పెరుగుట.

**ఆగష్టు:** గత 3 మాసముల కంటే ఈ మాసం కొంచెం మేలు, చేయు పనుల యందు విజయము చేకూరుట, ఆరోగ్యము, కుటుంబ కలహాలు తగ్గుట, పాత బాకీలు వసూలు అగుట, రాజకీయ వ్యవహారముల యందు జయము, విందు, వినోదాల యందు పాల్గొనుట.

**సెప్టెంబరు:** శుభా శుభ మిశ్రమము, ఆదాయం బాగుండును, శరీరం ఆరోగ్యంగా ఉంగును. ద్రవ్యము నిల్వ చేయుదురు, పనులు ఆలస్యంగానైనా పూర్తి చేయుదురు. సంతాన ఒత్తిడి, అన్నదమ్ముల మధ్య స్వల్ప మనస్పర్ధలు.

**అక్టోబరు:** తలచిన పనులు నెరవేరుట, వ్యసనములు వృద్ధి అగుట, సంఘం నందు గౌరవ మర్యాదలు, శుభకార్యములు నెరవేరుట, శత్రువులు మిత్రులగుట, ఏ పని తలపెట్టినా త్వరితముగా పూర్తి అగుట వల్ల మనస్సున సంతోషము, విదేశీ ప్రయాణములు కలసి వచ్చును.

**నవంబరు:** జాయింటు వ్యవహారములు అనుకూలించుట, స్వబుద్ధిచే ఇష్టం సిద్ధించుట, దేశ సంచారము, భార్య భర్తల మధ్య విరోధములు, అనవసరపు ప్రయాణములు, ప్రతి పని యందు ఒత్తిడి పెరుగుట.

**డిశంబరు:** పెద్దవారితో స్నేహములు కలసి వట్టుట, పాత బాకీలు వసూలు అగుట, గృహ నిర్మాణాది పనులు కలసి వచ్చుట, ఈ నెల ఆరోగ్యము నందు జాగ్రత్త అవసరము. బంధు మిత్రులతో మనస్పర్థలు, నమ్మక ద్రోహములు, అనారోగ్యముచే బాధపడుట.

**2019 జనవరి:** చేయు కృషియందు అభివృద్ధి, కోపం అధికమగుట, ప్రయాణములు కలసి వచ్చుట. పెద్దవారి మన్ననలు పొందుట, మనస్సున నూతనమైన ఆలోచనలతో అన్ని విధములుగా బాగుండును. రాజకీయ వ్యవహారముల యందు జయముగా ఉండును.

**ఫిబ్రవరి:** ఆదాయం మించిన ఖర్చులు, పనులు త్వరితముగా పూర్తి కాకుండుట, అన్నదమ్ముల మధ్య మనస్పర్థలు, వాహన గృహ సంబంధిత ఋణములు చేయుట, ఆదాయం బాగుండును, చేయు వృత్తి కృషి యందు లాభములు, బంధు మిత్రులతో విందులు వినోదాలు.

**మార్చి:** ఇంటి యందు శుభకార్యములు కలసి వచ్చుట, దైవ సంబంధిత పనులకు ధనము ఖర్చు చేయుట, ప్రయత్నించిన కార్యములు ఆలస్యంగా అవుట, భార్య భర్తల మధ్య అన్యోన్యత లోపించుట, జీర్ణక్రియ సంబంధిత అనారోగ్యములు, మనస్సున సంకటము, వ్యాపారం నందు ఋణ బాధలు.

## ఏలినాటి శని ప్రభావము

మనం జన్మించినపుడు ఉండే గ్రహ సంచారము జన్మలగ్న ఫలితము లగును. ప్రస్తుత గ్రహ సంచారములు గోచార ఫలితములగును. ఏలినాటి శని అనేది గోచారములో దోషమే మన జన్మరాశికి 1-2-12వ రాశులు సంచరించు కాలమంతయు ఏలినాటి శని 7 1/2 సం॥లు. మన జన్మ రాశికి 4వ రాశియందు సంచరించు కాలమంతయు అర్థాష్టమ శని 2 1/2 సం॥లు, మన జన్మరాశికి 8వ రాశియందు సంచరించు కాల మంతయు అష్టమ శని అనియు 2 1/2 సం॥లు, ఈ విధముగా శని మానవులకు కష్ట నష్టములను కలిగించును. కొందరికి అధికముగాను, కొందరికి అల్పముగాను ఫలితములు కలుగజేయుటకు శని వారివారి జాతకము బలాబలములు అనుసరించే దోషసాంద్రతలు కలిగి ఉంటున్నాయి. ఏలినాటి శని ప్రతీ 30 సం॥లకు ఒకసారి ప్రవేశించును. ద్వాదశి రాశిలో శని భగవానుడు ప్రవేశించుటతోనే **ఏలినాటి శని** ప్రారంభమై మొదటి 2 1/2 సం॥లు మనకు అనుకోని విధంగా ఖర్చులు ప్రారంభమగును. మనస్సున చికాకులు, కుటుంబ కలహములు చేయు వృత్తి వ్యాపారాదులుయందు ఆటంకములు కలుగ జేయును. జన్మరాశిలో ఇంకొక 2 1/2 సం॥లు ఉంటూ మన దేహమునకు అనారోగ్యమును, నరముల సంబంధిత వ్యాధులు, తేజో హాని, బుద్ధి మందగించుట, అధిక భయము, బంధు విరోధములు కల్గించును, తదుపరి ద్వితీయ రాశిలో ఇంకొక 2 1/2 సం॥లు ఉంటూ అధిక నష్టము, కలహములు, నేత్ర సంబంధిత రోగము ప్రతీ విషయమున ఘర్షణలు, తగాదాలు కలిగించును. ఈ విధముగా ఏలినాటి శని 7 1/2 సం॥లు బాధించును.

**అర్ధాష్టమ శని :** మన రాశికి 4వ స్థానములో శని ప్రవేశించడంతోనే 2 1/2 సం॥ల కాలము స్థాన చలనము, వాహన ప్రమాదములు, స్థిరాస్తివలన మార్పులు. వాత సంబంధిత అనారోగ్యములతో భాదించును.

**అష్టమ శని :** మనరాశికి 8వస్థానములో శనిప్రవేశించడంతోనే 2 1/2 సం॥లు కాలం అధికమైన మానసిక వేదన, ఇంటా బయటా అనేక సమస్యలు, అనవసర కేసులో చిక్కుకొనుట, అవమానములు, నరముల సంబంధిత వ్యాధులతో బాధించును.

**దోష పరిహారం :** శనివారం శివాలయములో అభిషేకములు చేయించి నువ్వులు, బియ్యము, నలుపు వస్త్రము, మహిషి ప్రతిమ దానములు చేయుట, మందపల్లిలో తైలాభిషేకములు చేయించుకొనుట అనేక, అనేక శనీశ్వర గ్రహ దోషపరిహారములు ఆచరించుటవలన కొంతవరకూ దోష సాంద్రతను తగ్గించుకొనగలము అనుటలో ఏ మాత్రము సందేహం లేదు.

# ప్రతి దినము పరిపాలించు హోరాధిపతుల చక్రము

సూర్యోదయము నుండి ఒక గంట కాలము కలుపుకోవలెను.

| వారము | ఉ.6 నుండి 7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

సూర్యాస్తమయము నుండి ఒక గంట కాలము కలుపుకోవలెను.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

# అమృతాదియోగములు

| నక్షత్రములు | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృ | అమృ | సిద్ధ |
| భరణి | ప్రభ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ |
| రోహిణి | సిద్ధ | అమృ | అమృ | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ |
| మృగ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| ఆర్ద్ర | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| పున | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| పుష్య | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ |
| ఆశ్లేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | మృత్యు |
| మఖ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృ | అమృ | అమృ |
| పుబ్బ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉత్తర | అమృ | సిద్ధ | అమృ | అమృ | మృత్యు | సిద్ధ | మృత్యు |
| హస్త | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రభ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతీ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | అమృ |
| విశాఖ | మృత్యు | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనూ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ట | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | ప్రభ | మృత్యు | సిద్ధ |
| మూల | అమృ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ | సిద్ధ |
| పూ॥షా॥ | సిద్ధ | ప్రభ | సిద్ధ | అమృ | సిద్ధ | ప్రభ | సిద్ధ |
| ఉ॥షా॥ | అమృ | మృత్యు | ప్రభ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శ్రవణ | అమృ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రభ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషం | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ |
| పూ॥భాద్ర | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉ॥భాద్ర | అమృ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| రేవతి | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | ప్రభ |

అమృ – అమృతయోగం
సిద్ధ – సిద్ధయోగం } **శుభం**

మృత్యు – మృత్యుయోగం
ప్రభ – ప్రబలారిష్టము } **అశుభం**



# ప్రయాణమునకు ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | యోగం | ఫలితం |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | ఆనంద | కార్యసిద్ధి |
| భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | కాలదండ | కార్యసిద్ధి |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్ర | ఉ.భా | దూమ్ర | ధననష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రీ | కార్యసిద్ధి |
| మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | సౌమ్య | సర్వసౌఖ్యం |
| ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ద్వాంక్ష | కార్యహాని |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ | కార్యసిద్ధి |
| పుష్య | ఉత్తర | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స | లాభం |
| ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | వజ్ర | కార్యహాని |
| మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | ముద్గర | కలహం |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | ఛత్ర | స్త్రీ లాభం |
| ఉత్తర | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర | మిత్రలాభం |
| హస్త | అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | మానస | కార్యలాభం |
| చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | మఘ | పద్మ | ఐశ్వర్యప్రదం |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబ | కష్టం నష్టం |
| విశా | పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | ఉత్పాత | ద్రవ్యనాశం |
| అనూ | ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | మృత్యు | సర్పదర్శనం |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | కాల | అవమానం |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధ | కార్యసిద్ధి |
| పూ.షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | శుభ | పనియగును |
| ఉ.షా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృత | కార్యసిద్ధి |
| అభి | పూ.భా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | ముసల | దుఃఖం |
| శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గదా | చెరువు |
| ధని | రేవ | రోహి | పుష్య | ఉత్తర | విశా | పూ.షా | మాతంగ | అశ్వలాభం |
| శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త | అనూ | ఉ.షా | రాక్షస | మిత్రకలహం |
| పూ.భా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర | దుర్వార్తలు |
| ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర | మిశ్రమఫలం |
| రేవ | రోహి | పుష్య | ఉఫ | విశా | పూ.షా | ధని | వర్ధమాన | శివదర్శనం |

## దగ్ధ యోగములు

| | | |
|---|---|---|
| తదియ | బుధవారం | ఆయా తిథులయందు ఈ వారములు కలిసినప్పుడు పై రోజులలో ప్రయాణాదులు విసర్జించవలెను. |
| పంచమి | మంగళవారం | |
| షష్ఠి | గురువారం | |
| అష్ఠమి | శుక్రవారం | |
| ఏకాదశి | సోమవారం | |
| నవమి | శనివారం | |
| ద్వాదశి | ఆదివారం | |

## వారశూలలు

| | |
|---|---|
| **తూర్పునకు** : | శని, సోమవారములు మరియు పాడ్యమి, నవమి తిథుల యందు |
| **ఆగ్నేయమునకు** : | గురు, శనివారములు మరియు తదియా ఏకాదశి తిథులయందు |
| **దక్షిణమునకు** : | గురువారములు మరియు పంచమి త్రయోదశి తిథులయందు |
| **నైఋతికి** : | సోమ, శుక్రవారములు మరియు చవితి ద్వాదశి తిథులయందు |
| **పడమరకు** : | ఆది, శుక్రవారములు మరియు షష్ఠి చతుర్ధశి తిథులయందు |
| **వాయువ్యమునకు** : | ఆది, మంగళవారములు మరియు సప్తమి, పూర్ణిమ తిథులయందు |
| **ఉత్తరమునకు** : | మంగళ, బుధవారములు మరియు విదియ, దశమి తిథులయందు |
| **ఈశాన్యమునకు** : | బుధవారము మరియు అష్టమి, అమావాస్య తిథులయందు ప్రయాణములు చేయరాదు. |

**మిక్కిలి అవసరమైనపుడు** ఆది, శుక్రవారములయందు (15 ఘు॥) మధ్యాహ్నం 12 గం దాటిన తరువాత సోమ, శనివారాలయందు (7 ఘు॥) ఉ॥ 8-38 ని॥ దాటిన తరువాత మంగళ, బుధవారముల యందు (12 ఘు॥) ఉ. 10.48 ని॥ దాటిన తర్వాత గురువారం (22 ఘు॥) మ. గం. 2.48 ని॥ దాటిన తరువాత ప్రయాణము చేయవచ్చును. మరియు **ఏ దిశకైనా సూర్యోదయానికి ముందు ప్రయాణంచేస్తే వారశూల దోషం లేదు.**

ఇందు శుభకార్యాలు చేయరాదు. అశుభప్రదము.
ఇవి మద్రాసు ప్రాంతముల వారికి ఆచారము.

| రాహుకాలము | | | | |
|---|---|---|---|---|
| ఆది | మ | 4-30 | ల | 6-00 |
| సోమ | ఉ | 7-30 | ల | 9-00 |
| మంగ | మ | 3-00 | ల | 4-30 |
| బుధ | మ | 12-00 | ల | 1-30 |
| గురు | మ | 1-30 | ల | 3-00 |
| శుక్ర | ఉ | 10-30 | ల | 12-00 |
| శని | ఉ | 9-00 | ల | 10-30 |

| గుళిక కాలము | | | | |
|---|---|---|---|---|
| ఆది | మ | 3-00 | ల | 4-30 |
| సోమ | మ | 1-30 | ల | 3-00 |
| మంగ | మ | 12-00 | ల | 1-30 |
| బుధ | ఉ | 10-30 | ల | 12-00 |
| గురు | ఉ | 9-00 | ల | 10-30 |
| శుక్ర | ఉ | 7-30 | ల | 9-00 |
| శని | ఉ | 6-00 | ల | 7-30 |

| యమగండము | | | | |
|---|---|---|---|---|
| ఆది | మ | 12-00 | ల | 1-30 |
| సోమ | ఉ | 10-30 | ల | 12-00 |
| మంగ | ఉ | 9-00 | ల | 10-30 |
| బుధ | ఉ | 7-30 | ల | 9-00 |
| గురు | ఉ | 6-00 | ల | 7-30 |
| శుక్ర | మ | 3-00 | ల | 4-30 |
| శని | మ | 1-30 | ల | 3-00 |

## గౌరీ పంచాంగము

పగటి ముహూర్తములు — సూర్యోదయం నుండి 1 1/2 గంll ప్రమాణం కలుపుకోవలయును

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3 | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| 5 | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | శుభం | లాభం |
| 7 | అమృ | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| 8 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

రాత్రి ముహూర్తములు — సూర్యాస్తమయం నుండి 1 1/2 గంll ప్రమాణం కలుపుకోవలయును

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృ | విషం |
| 2 | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | జ్వరం | ఉద్యో | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 4 | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| 5 | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| 6 | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

# శిశు జనన నక్షత్ర పాద దోషములు

మృగ, పున, స్వాతి, అనూ, ఉ॥షా, శ్రవ, ధనిష్ఠ, శత, ఉ॥భాద్ర ఈ నక్షత్రములో జననమైన ఏవిధమైన దోషములు లేవు, అందరూ చూడవచ్చును. మిగిలిన కొన్ని నక్షత్రములకు విశేషముగనూ కొన్ని నక్షత్రములకు స్వల్పముగనూ దోషములన్నవి. ఈ క్రింది పట్టిక చూడండి.

| నక్షత్రము | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం | విశేష దోషమునకు శాంతి |
|---|---|---|---|---|---|
| అశ్విని | విశేష దోషం శిశువుకు తండ్రికి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | తెలుపువస్త్రంలో బియ్యం, రజిత అశ్వం, సువర్ణం దానం |
| భరణి | స్వల్ప దోషం | స్వల్ప దోషం | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | స్వల్ప దోషం | నలుపువస్త్రంలో రాగిపాత్ర, ముడినువ్వులు, రజిత మహిషం దానం |
| కృత్తిక | స్వల్ప దోషం | స్వల్ప దోషం | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | స్వల్ప దోషం | ఎఱ్ఱటి వస్త్రంలో బియ్యం, రజిత మేషం ప్రతిమ దానం |
| రోహిణి | విశేష దోషం మేనమామకు | విశేష దోషం తండ్రి మేనమామ | విశేష దోషం తల్లి మేనమామ | విశేష దోషం మేనమామ | తెలుపు వస్త్రంలో బియ్యం, ముడినువ్వులు, సువర్ణం దానం |
| మృగశిర | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | |
| ఆరుద్ర | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | స్వల్ప దోషం తల్లికి | నీడ నూనెలో చూడవలెను |
| పునర్వసు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| పుష్యమి | స్వల్ప దోషం | విశేష దోషం పగలు-తండ్రికి రాత్రి-తల్లికి | విశేష దోషం పగలు-తండ్రికి రాత్రి-తల్లికి | స్వల్ప దోషం | తెలుపు వస్త్రంలో బియ్యం, గంధపుచెక్క దానం |
| ఆశ్లేష | దోషం లేదు | విశేష దోషం శిశువు, ధనంకు | విశేష దోషం తల్లికి | విశేష దోషం తండ్రికి | తెలుపు వస్త్రంలో బియ్యం, రజత సర్పం |
| మఖ | విశేష దోషం శిశువునకు తండ్రికి | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | దోషం లేదు | తెలుపు వస్త్రంలో బియ్యం, రజత అశ్వం ప్రతిమ దానం |
| పుబ్బ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | స్వల్ప దోషం తల్లికి | నీడ నూనెలో చూడవలెను |
| ఉత్తర | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | దోషం లేదు | దోషం లేదు | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | తెలుపు వస్త్రంలో బియ్యం, రాగి పాత్ర, ముడినువ్వులు దానం |
| హస్త | దోషం లేదు | దోషం లేదు | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | దోషం లేదు | తెలుపు వస్త్రంలో బియ్యం దానం |

# శిశు జనన నక్షత్ర పాద దోషములు

| నక్షత్రము | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం | విశేష దోషమునకు శాంతి |
|---|---|---|---|---|---|
| చిత్త | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | విశేష దోషం తండ్రికి | విశేష దోషం తండ్రికి | స్వల్ప దోషం | ఎరుపు వస్త్రంలో బియ్యం దానం |
| స్వాతి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| విశాఖ | స్వల్ప దోషం మగ-బావమరిది ఆడ - మరదలు | స్వల్ప దోషం మగ-బావమరిది ఆడ - మరదలు | స్వల్ప దోషం మగ-బావమరిది ఆడ - మరదలు | స్వల్ప దోషం మగ-బావమరిది ఆడ - మరదలు | నీడ నూనెలో చూడవలెను |
| అనూరాధ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | తెలుపు వస్త్రంలో బియ్యం, రజిత గోవుప్రతిమ దానం |
| జ్యేష్ఠ | విశేష దోషం సౌఖ్య హాని తల్లికి | విశేష దోషం సోదరులకు మేనమామలకు | విశేష దోషం శిశువునకు తల్లి-పెదతండ్రి | విశేష దోషం తండ్రికి,తల్లికి జాతకుని అన్నకు | |
| మూల | విశేష దోషం తండ్రికి | విశేష దోషం తల్లికి | విశేష దోషం ధనమునకు | విశేష దోషం | నలుపు వస్త్రంలో బియ్యం, మహిషం దానం |
| పూర్వాషాఢ | దోషం లేదు | దోషం లేదు | విశేష దోషం మగ-తండ్రికి ఆడ-తల్లికి | దోషం లేదు | తెలుపు వస్త్రంలో బియ్యం, దానం |
| ఉత్తరాషాఢ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| శ్రవణం | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| ధనిష్ఠ | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| శతభిషం | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | లేదు. |
| పూర్వాభాద్ర | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | స్వల్ప దోషం శిశువునకు | నీడ నూనెలో చూడవలెను |
| ఉత్తరాభాద్ర | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | |
| రేవతి | దోషం లేదు | దోషం లేదు | దోషం లేదు | విశేష దోషం తండ్రి, శిశువునకు | తెలుపు వస్త్రంలో బియ్యం, సువర్ణం దానం |

వర్జ్యము, దుర్ముహూర్తం, గ్రహణ సమయాలలోను అన్న, అక్క తల్లితండ్రులయొక్క నక్షత్రముయందును, అమావాస్య తిధియందు జన్మించిన శాంతులు జరిపించవలెను.

ప్రేగు మెడలో వేసుకుని పుట్టిన, ఎదురు కాళ్ళతో పుట్టిన మేనమామలకు దోషం. శాంతి చేయవలెను.

## ప్రతీరోజు హోరాధిపతులు - ఫలితములు

**1. రవి :** అధికారులను కలుసుకొనుటకు, రాజకీయ వ్యవహారములకు, దస్తావేజులు వ్రాయుటకు, ప్రభుత్వమునకు సంబంధించిన పనులకు, వివాదములు పరిష్కారమునకు స్పీడ్‌గా ఉండును. ఉద్యోగంలో జాయిన్ అగుటకు, భూమి రిజిస్ట్రేషన్ మంచిది. ఇండ్లు, స్థలములు కొనుటకు, అమ్ముటకు మంచిది.

**2. శుక్రుడు :** నూతన వస్తు, వస్త్రములు కొనుటకు, ధరించుటకు, ప్రయాణమునకు, నూతన వాహనములు కొనుటకు, ఉపయోగించుటకు మంచిది. స్త్రీలకు సంబంధించిన ఆభరణములు కొనుటకు చాలా మంచిది. వివాహాది శుభ విషయములు మాట్లాడుటకు మంచిది. పెండ్లి చూపులు, విందు విలాసాదులకు, నూతన వ్యక్తులతో పరిచయములకు మంచిది. ఇండ్లు, స్థలములు కొనుటకు, అమ్ముటకు మంచిది.

**3. బుధుడు :** క్రయ, విక్రయములకు, దస్తావేజులు వ్రాయుటకు, గణితము నేర్చుటకు, నూతన వస్తు, వస్త్రములు కొనుటకు, ధరించుటకు మంచిది. సకల శుభకార్యములు జరిపించుకొనుటకు మంచిది. వ్యాపార, ఉద్యోగాదులలో ప్రవేశించుటకు జ్యోతిష్యము మొదలైన విద్యలు నేర్చుకొనుటకు, పెండ్లి చూపులకు మంచిది. ఇండ్లు, స్థలములు కొనుటకు, అమ్ముటకు మంచిది.

**4. చంద్రుడు :** కూల్‌డ్రింక్స్, ఫ్రూట్స్, జ్యూస్ వ్యాపారాదులకు, క్రొత్త ఉద్యోగ, వ్యాపారాదులలో చేరుటకు, నూతన, వస్తు వస్త్రములు కొనుటకు, ధరించుటకు, సకల శుభకార్యములకు మంచిది. పెండ్లిచూపులు, నూతన వ్యక్తులను కలుసుకొనుటకు, ప్రయాణములకు మంచిది. ఇండ్లు, స్థలములు కొనుటకు, అమ్ముటకు మంచిది.

**5. శని :** ఈ హోరలో ఏ విధమైన ప్రయాణము చేయరాదు. వస్తు, వస్త్రాదులు కొనుట చేయరాదు. ఏ విధమైన శుభకార్యములు చేయరాదు. విరోధములు కలిగించును. కట్టెలు, ఇనుము, ఆయిల్స్, నూనె, పశువుల వ్యాపారాదులకు కొంత మంచిది.

**6. గురుడు :** నూతన వస్తు, వస్త్రములు కొనుట, ధరించుట, వాహనములు కొనుట, అధిరోహించుట, నూతన విద్యలు నేర్చుకొనుట, ధన సంబంధమైన వ్యాపారాదులకు, సకల శుభకార్యములు చేయుటకు మంచిది. పెండ్లిచూపులకు, నూతన ఉద్యోగాదులలో ప్రవేశించుటకు, టెండర్లు, పాట చీట్లు వేయుటకు మంచిది. బంగారు ఆభరణములు కొనుటకు మంచిది. ఇండ్లు, స్థలములు కొనుటకు, అమ్ముటకు మంచిది.

**7. కుజుడు :** విరోధములు కలిగించును, తగవులు పెంచును, వ్యవసాయాది పనులకు కొంతవరకూ మంచిది. ఏ విధమైన శుభకార్యములు చేయరాదు. స్నేహ, బంధు విరోధములు కలుగును.

**ఇందు శుక్ర, బుధ, చంద్ర, గురు హోరలు సకల శుభములు కలిగించును.**
**రవి మిశ్రమ ఫలదాయకం శని, కుజ హోరలు అశుభదాయకము**

# రవ్యాది నవగ్రహములకు మహాదశ, అంతర్దశా వివరములు

| గ్రహములు | రవి | | | చంద్రుడు | | | కుజుడు | | | రాహువు | | | గురుడు | | | శని | | | బుధుడు | | | కేతువు | | | శుక్రుడు | | | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | సం | నె | రో | దశా సం॥ |
| 1. రవి | 0 | 3 | 18 | 0 | 6 | 0 | 0 | 4 | 6 | 0 | 10 | 24 | 0 | 9 | 18 | 0 | 11 | 12 | 0 | 10 | 6 | 0 | 4 | 6 | 1 | 0 | 0 | 6 సం॥ |
| 2. చంద్రుడు | 0 | 6 | 0 | 0 | 10 | 0 | 0 | 7 | 0 | 1 | 6 | 0 | 1 | 4 | 0 | 1 | 7 | 0 | 1 | 5 | 0 | 0 | 7 | 0 | 1 | 8 | 0 | 10 సం॥ |
| 3. కుజుడు | 0 | 4 | 6 | 0 | 7 | 0 | 0 | 4 | 27 | 1 | 0 | 18 | 0 | 11 | 6 | 1 | 1 | 9 | 0 | 11 | 27 | 0 | 4 | 27 | 1 | 2 | 0 | 7 సం॥ |
| 4. రాహువు | 0 | 10 | 24 | 1 | 6 | 0 | 1 | 0 | 18 | 2 | 8 | 12 | 2 | 4 | 24 | 2 | 10 | 6 | 2 | 6 | 18 | 1 | 0 | 18 | 3 | 0 | 0 | 18 సం॥ |
| 5. గురుడు | 0 | 9 | 18 | 1 | 4 | 0 | 0 | 11 | 6 | 2 | 4 | 24 | 2 | 1 | 18 | 2 | 6 | 12 | 2 | 3 | 6 | 0 | 11 | 6 | 2 | 8 | 0 | 16 సం॥ |
| 6. శని | 0 | 11 | 12 | 1 | 7 | 0 | 1 | 1 | 9 | 2 | 10 | 6 | 2 | 6 | 12 | 3 | 0 | 3 | 2 | 8 | 9 | 1 | 1 | 9 | 3 | 2 | 0 | 19 సం॥ |
| 7. బుధుడు | 0 | 10 | 6 | 1 | 5 | 0 | 0 | 11 | 27 | 2 | 6 | 18 | 2 | 3 | 6 | 2 | 8 | 9 | 2 | 4 | 27 | 0 | 11 | 27 | 2 | 10 | 0 | 17 సం॥ |
| 8. కేతువు | 0 | 4 | 6 | 0 | 7 | 0 | 0 | 4 | 27 | 1 | 0 | 18 | 0 | 11 | 6 | 1 | 1 | 9 | 0 | 11 | 27 | 0 | 4 | 27 | 1 | 2 | 0 | 7 సం॥ |
| 9. శుక్రుడు | 1 | 0 | 0 | 1 | 8 | 0 | 1 | 2 | 0 | 3 | 0 | 0 | 2 | 8 | 0 | 3 | 2 | 0 | 2 | 10 | 0 | 1 | 2 | 0 | 3 | 4 | 0 | 20 సం॥ |

| రవి | చంద్రుడు | కుజుడు | రాహువు | గురుడు | శని | బుధుడు | కేతువు | శుక్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|
| కృత్తిక<br>ఉత్తర<br>ఉ॥షా॥ | రోహిణి<br>హస్త<br>శ్రవణం | మృగశిర<br>చిత్ర<br>ధనిష్ఠ | ఆరుద్ర<br>స్వాతి<br>శతభిషం | పునర్వసు<br>విశాఖ<br>పూ॥భాద్ర | పుష్యమి<br>అనూరాధ<br>ఉ॥భాద్ర | ఆశ్లేష<br>జ్యేష్ఠ<br>రేవతి | మఖ<br>మూల<br>అశ్విని | పుబ్బ<br>పూర్వాషాఢ<br>భరణి |

*ఈ 27 నక్షత్రములకు మహాదశలు పై విధముగా వర్తించును*

## వివాహ విషయములు



**వివాహ విశిష్ఠత :** వివాహం మానవ జీవితములో ఒక ప్రధాన అంశం. సృష్టియొక్క ధర్మాన్ని ఆచరించడానికి మూలమై వంశాభివృద్ధి కలిగి గృహస్థా శ్రమమునకు కారణ మగుచున్నది. మానవులు జీవించినంతకాలం తనకు జరిగే మంచి చెడ్డలు అన్నింటిలోను గృహస్థా శ్రమము ప్రధాన పాత్ర పోషించుచున్నది. అటువంటి గృహస్థాశ్రమములో చక్కటి సంతానాన్ని కలిగించు కొని ఇతరులకు ఏ హానికలుగకుండా సంఘములో చక్కటి సహజీవనాన్ని సాగించుటకు ఏ ఏ స్త్రీ పురుషులు జీవిత కాలం భార్యా భర్తలుగా ఉండాలో ఏఏ స్త్రీ పురుషులు ఉండ కూడదో అనే విషయముపై ఎన్నో నియమ నిబంధనలు మన భారత సంస్కృతి శాస్త్ర రూపంలో అందించినది.

వివాహ సంబంధ నిర్ణయములో రక్తసంబంధములో ఎంతదూరం ఉంటే అంత మంచిదని 7 తరాలు దాటిన స్త్రీ, పురుషులు, వివాహం చేసుకొనుట అత్యంత శుభదాయకముగా పూర్వ ఆచారమై ఉన్నది. అయితే నేటి సమాజంలో మేనరికాలు, బంధు వర్గ సంబంధాలు చేసుకుంటూ వారికి కలుగు సంతానంలో అనారోగ్యములతో బాధలు అనుభవించుట కొందరు దురదృష్టకరంగా భావించాలి. వధూవరులు కలిసి మిత్రత్వముతో జీవించుటకు 21 పొంతనములున్నవి. 1. రాశికూటమి, 2. యోని కూటమి 3. గ్రహమైత్రి, 4. స్త్రీ దీర్ఘకూటమి 5. గణకూటములు ముఖ్యముగాను మరియు ఏక నక్షత్రములు కుజ దోషములు ప్రధాన అంశములుగా ఆచరణలో ఉన్నవి.

**వివాహానికి వయస్సు :** పురుషునికి 21 స్త్రీకి 18 సం॥లలో వివాహము చేయవలెను. స్టడీ పూర్తి కాలేదని – లైఫ్ సెటిల్‌మెంట్ ఇంకా కాలేదని వివాహం వాయిదాలు వేయడం జరుగుతుంది. వివాహ నిర్ణయముపై కుటుంబ పరిస్థితి, కుటుంబ సమిష్ఠితో సమాజ పరిస్థితులు ఆధారపడి ఉంటాయి. అయితే నేటి వివాహ వ్యవస్థ పవిత్రతగా లేదని చెప్పాలి. నేటికాలంలో చాలా వివాహాలు పెద్దల నిర్ణయాలకు వ్యతిరేకంగాను, కులంతో పనిలేకుండా జరిగిపోతున్నాయి. గతించిన రోజులలో వివాహం అయిన తర్వాతే గర్భాదానం తోనే వారి సంసార జీవితం ప్రారంభమయ్యేది జీవితాంతం ఆస్త్రీతోనే సంసారం చేస్తూ తన ఆరోగ్యాన్ని తన శ్రేయస్సును అలాగే సమాజ శ్రేయస్సును పరిరక్షించగలిగే కుల సంఘ కట్టుబాట్లు ఉన్నాయి. యుక్త వయస్సు వచ్చిన స్త్రీ గడపలోపలే ఉండాలనేది ఆనాటి స్త్రీ సంస్కృతి. నేడు చదువులు గురించి ఉద్యోగాల గురించి రాజకీయాల గురించి గడపదాటి బయట ఉండాలనే సంప్రదాయం నేటిది. ఏ సినిమా చూసినా ఎలా ప్రేమించాలి, ఎలా లేచిపోవాలి ఇదే దృక్పథం. ప్రకటన్లు, ఫ్యాషన్లు పేరుతో ఫారన్ నాగరికతతో శృతిమించిన శృంగారాలు వలికే సన్నివేశాలే టి.వి. ప్రపంచం, ఇలాంటి సమాజంలో యువతరం, సాంప్రదాయ విలువలు విస్మరించి చిందులు వేస్తూ అనేక దుష్ఫలితాలతో కుటుంబాన్ని సమాజాన్ని ఆందోళలకు గురిచేస్తోంది. ఉద్యోగాలు వచ్చేవరకూ కోరికలు ఆగవు. కోరికలు అనేవి శరీర ధర్మం. కావున సకాలంలో వివాహాలు చేసే నిర్ణయాలు పెద్దలు తీసుకోవాలి. దానికి యువతరం కట్టుబడి ఉండాలి. అప్పుడే కుటుంబ పరువు ప్రతిష్ఠలు సమాజంలో

నిలబడేది. సక్రమమైన వివాహ నిర్ణయం వంశాభివృద్ధికి, మన భవిష్యత్తుకు పునాదులు అవుతాయి.

**1. రాశికూటమి :** స్త్రీరాశి నుండి పురుషరాశి వరకూ లెక్కించగా 1.3. 5. 7. 9. 10.11 రాశులు అయినచో శుభకరము. మిగిలిన వాటిలో కొన్ని శుభప్రదమైన షష్టాష్టక రాశులు మరికొన్ని శుభప్రదమైన ద్విద్వాదశారాశులు అయిఉన్నవి.

**2. శుభప్రదమైన షష్టాష్టకములు :** వృషభ–తులలు, మేష–వృశ్చికములు, కర్కాటక–ధనస్సులు, సింహ–మీనములు, కన్యా–కుంభములు, మిధున–మకరములు శుభప్రదమైన షష్టాష్ఠకములు వివాహములు చేయవచ్చును.

**3. శతృషష్టాష్టకములు :** కర్కాటక–కుంభాలు, సింహ–మకరములు, తులా – మీనములు, మిధున–వృశ్చికములు, వృషభ–ధనుస్సులు, మేష–కన్యలు, ఇవి శతృషష్టాష్టకాలై మాట కలయక కలహించు కుందురు, వివాహములు చేయరాదు.

**4. ద్విద్వాదశములు :** స్త్రీ రాశినుండి పురుషరాశి రెండవదైన శుభప్రదం. కర్కాటక–సింహములు, మకర–కుంభములు, కన్యా–తులలు, వృశ్చిక–ధనుస్సులు, వృషభ–మిధునములు, మీన–మేషములు శుభప్రదమైనవి. వివాహం చేయవచ్చును.

**5.యోనికూటము :** వధూవరుల జన్మలేక, నామ నక్షత్రరీత్యా పాము–ముగింస, పిల్లి–ఎలుక, కుక్క–లేడి, సింహము–ఏనుగు, గుర్రము–దున్నపోతు, ఆవు–పులి, కోతి–మేక అయివున్న యెడల విరోధములతో తగువులాడు కొందురు. వివాహము చేయరాదు.

**6. గ్రహమైత్రి :** వధూవరుల జన్మరాశ్యాధిపతులు ఒక్కరే అయినా మిత్ర, సములైనా వివాహము చేయవచ్చును. శతృవులైనా చేయరాదు.

**7.స్త్రీ దీర్ఘ కూటమి :** స్త్రీ యొక్క నక్షత్రము నుండి మొదటి 9 నక్షత్రముల వరకూ కలహ ప్రదము 10 నక్షత్రము నుండి 18 వరకూ మధ్యమ ఫలములు. 19వ నక్షత్రము నుండి 27 నక్షత్రముల వరకు అత్యంత శుభప్రదము.

**8. గణకూటమి :** వధూవరులు ఏకగణమైన అత్యంత శుభప్రదము, దేవ–మానుష గణములు శుభప్రదము, దేవ–రాక్షస గణములు వైరము మానుష–రాక్షస గణములు అశుభదాయకము. దేవరాక్షస గణములలో పురుషునిది రాక్షసగణమైన వివాహము చేయవచ్చును.

**9. ఏకనక్షత్రము :** వధూవరుల నక్షత్రములు రెండునూ ఒకటి అయినచో ఈ నక్షత్రములు రోహిణి, ఆరుద్ర, మఖ, విశాఖ, పుష్యమి, శ్రవణం, ఉIIభాద్ర, రేవతీ నక్షత్రములు వివాహము చేయవచ్చును. అశ్విని, భరణి, ఆశ్లేష, పుబ్బ, స్వాతి, అనూరాధ, మూల, శతభిషం నక్షత్రములు సామాన్య అనురాగము కలవారై ఉందురు. మిగతా నక్షత్రములు ఒకటైనచో చేయరాదు.

**10. వధూ వర గుణమేళన చక్రం :** వధూవరుల గుణమేళన చక్రము 18 గుణములు దాటి వచ్చినను వివాహము చేయవచ్చును. బ్రాహ్మణులకు–గ్రహమైత్రి, క్షత్రియులకు–గణకూటములు, వైశ్యులకు– స్త్రీ ధీర్ఘము, ఇతరులకు యోనిపొంతనములు శుభయుక్తమై ఉండి 18 గుణములు వచ్చిన వివాహము చేయుట ఆచారమై ఉన్నది.

**11. వైర నక్షత్రములు :** అశ్విని–జ్యేష్ట, భరణి–అనూరాధ, కృత్తిక–విశాఖ, రోహిణి–స్వాతి, ఆరుద్ర–శ్రవణం, పునర్వసు–ఉత్తరాషాఢ, పుష్యమి–పూర్వాషాఢ, ఆశ్లేష–మూల, మఖ–రేవతి, పుబ్బ–ఉత్తరాభాద్ర, ఉత్తర–పూర్వాభాద్ర, హస్త–శతభిషం ఈ నక్షత్రములకు పరస్పర వేధ కలిగి యుండును. కావున వధూవరుల జన్మ నక్షత్రములు ఈ జంట నక్షత్రములు అయినచో కలహములు కలుగును. వివాహం చేయరాదు.

**12. సోదరుల వివాహ నిర్ణయం :** కుమారునికి వివాహము చేసిన తర్వాత రెండవ కుమారునిగాని, కుమార్తెకు గానీ వివాహము చేయుటకు ఒకే తెలుగు సంవత్సరములో అయితే 6 నెలలు పూర్తి అయిన తర్వాత చేయవలెను. సంవత్సరాది ముందు ఒకరికి సంవత్సరాది వెళ్ళిన తర్వాత మరియొకరికి చేసిన 6 నెలలతో పనిలేదు. అలాగే ఒకే తెలుగు సం॥ములో కుమార్తెకు కుమారునకు ఏకకాలములో చేయరాదు. ముందు కుమార్తెకు చేసిన తర్వాత కుమారునికి చేయవచ్చును. మరియు ముందుగా కుమారునికి చేస్తే 6 నెలల తర్వాతే కుమార్తెకు వివాహం చేయాలి. ఒకే గర్భమునందు జన్మించిన అన్నదమ్ములకు గాని అక్క చెల్లెళ్ళకు గానీ ఒకే కాలమందు వివాహము చేయరాదు. 6 నెలలు తేడా ఉండాలి లేదా సంవత్సరాది బేధం అయి ఉండాలి. మేనమామ కుమార్తెను వివాహము చేసుకొనేటప్పుడు గణకూటము, పొంతనములు మొదలైన విషయములు చూడనవసరం లేదు.

**13. త్రిజ్యేష్ఠ :** మొట్ట మొదటి గర్భమున జన్మించిన వారు జీవించి యున్నను, మరణించియున్ననూ, వారే జ్యేష్ఠులు – వధూవరులు జ్యేష్ఠులైన జ్యేష్ఠ మాసములో వివాహము చేయకూడదు. ఇరువురిలో ఒకరు జ్యేష్ఠులై ఎవరో ఒకరు జ్యేష్ఠ నక్షత్రం అయినా జ్యేష్ఠమాసంలో వివాహం చేయరాదు. వరుడు జ్యేష్ఠుడైనపుడు, జ్యేష్ఠమాసంలో వివాహం చేయుట లేదు. ఇది ఆచారమై ఉన్నది.

**14. కుజ దోష వివరణ :** స్త్రీ పురుష జాతకాలయందు కుజుడు 2, 4, 7, 8, 12 స్థానములలో ఉంటే కుజదోషం. కుజుడు పై దోష స్థానములలో ఉండి గురునితో కాని చంద్రునితో గాని కలిసి ఉన్ననూ పరస్పర వీక్షణలు కలిగియున్న కుజదోషము లేదని, మేష, వృశ్చిక లగ్నములకు 4వ స్థానములోను, మిథున, కన్యలకు 2వ స్థానములోనూ కర్కాటక మకరములను 7వ స్థానములోనూ – ధనస్సు మీనములకు 8వ స్థానములోనూ వృషభ తులలకు 12వ స్థానములోనూ కుజుడు ఉండిన దోషము లేదు. కుజ దోషము వలన స్త్రీ జాతకములో ఉంటే పురుషునికి, పురుష జాతకంలో ఉండే స్త్రీకి సంసార జీవితములో ఆపదలు కలిగించును ఇరువురి జాతకములలోనూ కుజదోషం ఉన్నవారు దంపతులైతే వారి సంసార జీవితం సాఫీగానే ఉంటుంది.

కుజదోషం గల జాతకులకు వివాహ నిర్ణయములో ఆలస్యమగుట, కుదిరి చెడి పోవుట, ఆశాభంగం, కులాంతర వివాహాలకు దారితీయుట, పెద్దల నిర్ణయాలతో పనిలేక వివాహము చేసుకొనుట, ఈ విధమైన సంఘటనలకు దారి తీస్తోంది. దంపతులలో ఒక్కరికి కుజదోషము ఉండి మరియొకరికి లేనప్పుడు వారి వైవాహిక జీవితము చివరి వరకూ సాఫీగా ఉండుటలేదు. అనేక కలహాలతో కాపురము చేయుట కొందరు విడిపోవుట కొందరు విడాకులకు కోర్టులకు వెళ్ళుట, కొందరు ఇతర స్త్రీలతో సంబంధము కలిగియుండుట కొందరిలో ఎవరో ఒకరు నష్టమగుట అనేక దుస్సంఘటన

లకు దారి తీస్తున్నాయి. కుజదోషం అనేది పుట్టిన సమయాన్ని బట్టి అప్పటి లగ్న జాతకాదుల నిర్ణయములో తెలుస్తుంది తప్ప పుట్టిన టైం లేనివారికి, కుజదోషం ఉన్నదా? లేదా? అనేది తెలియదు. పేరును అనుసరించి తెలిసే విషయం మాత్రం కాదు. కుజదోషం ఉండి ఏ విధమైన లోటు పాట్లు లేక చక్కని సంసారాలు చేసుకొనే వారు అరుదుగా ఉంటారు. కుజదోషం లేకపోయినా సంసారములో ఎన్నో బాధలు కష్టాలు అనుభవించే వారు కొందరు ఉంటారు. ఇటువంటి పరిస్థితులు కలగడానికి వారి వారి పూర్వజన్మ కర్మ ఫలాలు కొన్ని అయితే వాస్తు బలాలు వాస్తు వక్రతలు కారణమగు చున్నవి. కావున శాస్త్రనిబంధనలు ఆచరించి వివాహ నిర్ణయములు చేసుకొనుట అత్యంత శుభదాయకం.

**15. పెండ్లి చూపులు :** ఆది, బుధ, గురు, శుక్ర, శని వారముల యందు శుభ తిథులలోనూ మంచిది. తారాబలము చూసుకొని పెండ్లి చూపులు చూసుకొనుట మంచిది. తాంబూలములు ఇచ్చి పుచ్చుకొనుట, పసుపు కుంకుమలు జరిపించు కొనుటకు మౌఢ్యమి రోజులు మంచివి కావు.

**16. విఘ్నేశ్వర ముడుపు :** సోమ, మంగళవారము తప్ప మిగిలిన వారముల లోను శుభ తిథులలోనూ, శుభ నక్షత్రములలో తారాబలం ఉన్న రోజున విఘ్నేశ్వరుని ముడుపుకట్టి, పెండ్లి సంబంధిత కార్యక్రమములు ప్రారంభించ వలెను. (మౌఢ్యములు, శూన్యమాసాలు పనికిరావు) వివాహం జరిగిన 16 రోజుల లోపున రాకపోకల కార్యక్రమములన్నియు శుభసమయాలలో జరిపించుకుని గర్భాదానం అయిన తర్వాత ప్రారంభంలో కట్టిన విఘ్నేశ్వర ముడుపుతో కుడుములు, ఉండ్రాళ్ళు, తయారు చేసి విఘ్నేశ్వరుని పూజించి నివేదన చేసి అందరూ ఆ ప్రసాదం స్వీకరించవలెను.

**17. పెండ్లి కుమార్తె, పెండ్లి కుమారుని చేయుట :** సోమ మంగళవారములు తప్ప మిగిలిన వారములు శుభ తిథులు శుభ నక్షత్రములు, తారాబలం కలసిన రోజున ఉదయం శుభవేళలో పెండ్లి కుమార్తెను, పెండ్లి కుమారుని చేయుదురు అదే సమయమునందు పందిరి ముహూర్తము చేయవలెను.

**18. వివాహ ముహూర్తములు :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోను ఆది, బుధ, గురు, శుక్ర, శని వారములలోనూ, అశ్విని, రోహిణీ, మృగశిర, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూ, మూల, ఉ॥షా, శ్రవణం, ధనిష్ఠ, శత, ఉ॥భాద్ర, రేవతి, నక్షత్రములు వివాహమునకు శుభప్రదము. శుభలగ్నములు, సప్తమ శుద్ధి, ముహూర్తలగ్నమునకు చంద్రుడు 1, 6, 7, 8, 12 స్థానములో ఉండరాదు. చంద్రుడు మనస్సు కారకుడై ఉన్నందు ముహూర్తమునకు చంద్ర దోషము ఉన్నట్లయితే కొందరి దంపతులకు మనస్పర్థలు కలిగించి అనేక కలహములకు కారణమగుచున్నది.

**19. నవవధూ ప్రవేశం :** వివాహం జరిగిన 16 రోజుల లోపల తిథి–వార–నక్షత్రములను పాటించక వర్జ్య దుర్ముహూర్తం లేని సమయాలలోను, శుక్ర, ఆది, మంగళవారములు కాకుండా నవవధూ ప్రవేశం చేయవచ్చును.

**20. నిషేకము :** పూర్వకాలంలో రజస్వల కాకుండానే చిన్న పిల్లలుగా ఉన్నప్పుడే వివాహములు జరిగేవి. రజస్వల అయిన తరువాత శుభముహూర్తాన గర్భాదానం

చేసేవారు. వివాహం జరిగిన తరువాత సకాలంలో రజస్వల కాలేనప్పుడు శుభముహూర్తం నిర్ణయించి, గర్భాదానం చేయుటనే నిషేకమంటారు.

**21. గర్భాదానము :** 2,3,5,7,10,13 తిధులలోనూ ఆది (సోమ) బుధ, గురు, శుక్ర వారములలోనూ అశ్విని, రోహిణీ, మృగశిర, మఖ, ఉత్తరాత్రయం, హస్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, శతభిషం, నక్షత్రములయందును లగ్నశుద్ధి కల్గిన శుభ లగ్నములలోనూ, గర్భాదానము చేసిన శుభకరంబగును. వ్రత దినములు, సంధ్యా సమయాలు, శ్రాద్ధ దినములు పనికిరావు, మరియు స్త్రీ రజోదర్శనము మొదలు 16 రాత్రులు ఋతుదినములు అనబడును. పుత్ర సంతానము కోరువారు శుద్ధి అయిన తదుపరి సమరోజులలో భార్య భర్తలు కలియవలెను.

**22. పుంసవనం :** 2, 3, 5, 7, 10, 13, 15 తిధులలోనూ, సోమ, బుధ, గురు, శుక్రవారాలలోనూ అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములలో తొలుత గర్భం ధరించిన స్త్రీలకు మూడవ నెలలో గర్భశుద్ధి కొరకు గర్భస్థ శిశువు క్షేమం కోరి మంగళకరమైన ముత్తైదువుల చేత వివిధ రకములైన పుష్పములను ముడిపించి వారి చేత ఆశీర్వాదం పొందుట పుంసవన మంటారు. ముత్తైదువులకు తాంబూలము సమర్పించి, శెనగలు పంచుదురు. తారాబలం ఉన్న రోజుల్లో శుభ లగ్నములలో అష్టమశుద్ధి చూసేది.

**గమనిక :** గర్భం ధరించిన మొదలు హింస, కక్షలు, ఉద్రేకపూరితమైన సన్నివేశాలుగల సినిమాలు, టి.వి.లు, చూచుటవలన దుర్మార్గులైన సంతతి కలిగే అవకాశమున్నది. ఆధ్యాత్మిక, భక్తిభావాలు గల సన్నివేశాలు చూస్తూ, మహాత్ములు, పుణ్యాత్ములు చరిత్రలను చదవడం, వినడం వలన ఉత్తములు, నీతివంతులు, సమాజాన్ని ఉద్ధరించేవారు జన్మిస్తారు. గర్భిణీ మాతలు తమకు మంచి సంతానాన్ని ప్రసాదించాలని ఈశ్వరుని ప్రార్థించుకోండి మంచి సంతానాన్ని పొందండి.



**23. సీమంతం :** 2, 3,5,7,10,11,13, 15 తిధులలోను ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలలోనూ పైన పుంసవనానికి చెప్పిన నక్షత్రాల్లోనూ, శుభ లగ్నములలోను తొలుత గర్భం ధరించిన స్త్రీలకు 4, 6, 8 నెలలో సీమంతం చేయుట శాస్త్ర సమ్మతమైనప్పటికి 5, 7, 9 నెలలో చేయుట ఆచారమైయున్నది. సుఖ ప్రసూతి కొరకు బిడ్డ క్షేమం కోరి మంగళప్రదమైన ముత్తైదువుల చేత 18 జతల గాజులను రెండు చేతులకు ధరింపచేసి వారి చేత ఆశీర్వాదం పొందుట సీమంతం అంటారు. పేరంటం పెట్టుదురు, స్వీట్లు పంచుదురు.

**24. పురిటికి తీసుకుని వచ్చుట :** 7, 8, 9వ మాసాలలో వారి వారి కుటుంబ అనవాయితీ ప్రకారం పురిటికి తీసుకుని వచ్చుట ఆచారమైనది. తారాబలం, ప్రయాణాది శుభ ఆనందాది యోగములు చూసుకొనేది.

**25. జనన శాంతులు :** శిశువు శాంతి నక్షత్రములలో జన్మించిన యెడల 11వ రోజు లగాయితూ నెల లోపులో బేసి సంఖ్యగల రోజులలో జనన శాంతులు

జరిపించుకొనుట మంచిది. అలాగే 21వ రోజున పుట్టిన నక్షత్రం రోజున శాంతులు చేయించుకొనుట మరింత ప్రశస్తం. శూన్యమాసాలలోను, మౌఢ్యమి రోజుల్లోను శాంతులు చేయించుకొనుట దూష్యము కాదు.



**26. ఊయ్యాలలో వేయుట :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోనూ ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారాలలోనూ, శుభ నక్షత్రాలలోనూ, ముఖ్యంగా 11, 21 రోజులలో వర్జ్యం, దుర్ముహర్తం లేని సమయాన శిశువును తూర్పు శిరస్సు ఉంచి ఊయలలో పరుండబెట్టవలెను.

**27. నామకరణ :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోనూ, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలలోనూ 11వ రోజున గాని, 21వ రోజున గాని బారసాల కార్యక్రమంలోనూ పేరు పెట్టవచ్చును. మరియు అన్నప్రాశన ముహూర్తమునకు 5 నిముషముల ముందుగా పేరు పెట్టవచ్చును. ముఖ్యంగా జన్మ నక్షత్రానికి సరిపడే అక్షరం పేరులో మొదట వచ్చే విధంగా పేరును నిర్ణయించుకొనుట మంచిది. (నామ నక్షత్ర రాశి గణ నాడి పొంతనములు గల పేజీ చూచేది.)



**28. చెవి, ముక్కు కుట్టుట :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోనూ ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలలోనూ, శుభలగ్నములలోనూ, 6, 7, 8 మాసాలలోనూ పగటి ఉదయ భాగంలోనూ చెవి, ముక్కు కుట్టుట శుభప్రదం.



**29. అన్నప్రాశన :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోనూ, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారాలలోనూ, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు దశమ శుద్ధిగల శుభలగ్నాలు మగపిల్లలకు 6, 8 నెలలు, ఆడపిల్లలకు 7,9 నెలలోనూ అన్నప్రాశన శుభప్రదం. కొందరు మగైనా, ఆడైనా 6 మాసముననే అన్నప్రాశన చేయుట ఆచారమై ఉన్నది. మౌఢ్యమి, శూన్యమాసాలలోనూ చేయవచ్చును. బారసాలలో పేరు పెట్టనివారు అన్నప్రాశన ముహూర్తానికి 5 నిమిషాల ముందుగా పేరు పెట్టవచ్చును.

**30. కేశఖండన :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులలోనూ, ఆది, సోమ, బుధ, గురు, శనివారాల్లోనూ అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతి నక్షత్రములందును పురుషులకు సరిమాసాలలోనూ, స్త్రీలకు బేసి మాసాలలోనూ పగటి పూర్వభాగంలోనూ ఉత్తరాయణంలోనూ కేశఖండ చేయుట శుభప్రదం. మొదటి సంవత్సరం వీలుపడని వారు మూడవ సంవత్సరంలో కేశఖండన చేయవచ్చును.

**31. ఉపనయనం:** 2, 3, 5, 7, 10, 13 తిథులు ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు అష్టమ శుద్ధి గల శుభలగ్నాలు గురు, రవి, చంద్రులు బలవంతులై ఉండగా ఉపనయనం ఆచరింపవలెను. గురు, శుక్ర మౌఢ్యములు, శూన్యమాసములు పనికిరావు.



**32. రజస్వల :** పాఢ్యమి, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, అమావాస్య తిథులయందు, ఆది, మంగళ, శనివారములయందు, భరణి, కృత్తిక, ఆరుద్ర, పునర్వసు, ఆశ్లేష, మఖ, పుబ్బ, జ్యేష్ట, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈ పది నక్షత్రములు ప్రథమ రజస్వల అయిన దోషములు కలుగును.

జ్యేష్ఠ, పున, ఆశ్లేష 3 మాసములు, కృత్తిక 4 మాసములు, మఖ, ఆరుద్ర 6 మాసములు, భర, పుబ్బ, పూ.షా, పూ.భాద్ర 12 మాసములు వరకూ దోషములు వర్తించును. ఈ దోషములు గడిచే వరకూ వివాహ నిర్ణయములు చేసుకోరాదు. ఈ దోష నక్షత్రములయందు రజస్వల అయినప్పుడు, వధువు యొక్క నీడను తల్లి, తండ్రి చూసుకొని, నూతన పాత్రలో నెయ్యిపోసి పాత్రతో సహా దానము చేయుట ఆచారమై ఉన్నది.



## మాసాధిపతులు -దైవనామాలు

| మాసములు | మగశిశువు | ఆడశిశువు |
|---|---|---|
| 1. చైత్రము | కృష్ణ | భూదేవి |
| 2. వైశాఖము | అనంత | కళ్యాణి |
| 3. జ్యేష్ఠము | అచ్యుత | సత్యభామ |
| 4. ఆషాఢము | చక్రి | పుణ్యవతి |
| 5. శ్రావణము | వైకంఠ | రూపవతి |
| 6. భాద్రపదము | జనార్ధనం | ఇందుమతి |
| 7. ఆశ్వీయుజము | ఉపేంద్ర | ఇంద్రావతి |
| 8. కార్తీకము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9. మార్గశిరము | వాసుదేవ | వాగ్దేవి |
| 10. పుష్యము | హరనాధ | పద్మావతి |
| 11. మాఘము | గోవింద | శ్రీదేవి |
| 12. ఫాల్గుణము | పుండరీకాక్ష | సావిత్రి |

## అదృష్టము కలుగజేసే పుట్టుమచ్చలు

పుట్టుమచ్చల శాస్త్రమనగా అద్భుతమైన మహాశాస్త్రం ఈ పుట్టు మచ్చలతో అనేక రంగులు గల మచ్చలుంటాయి. అవి తేనె వర్ణము, నీలి వర్ణము, ఎరుపు వర్ణం, శ్వేత వర్ణం, గోధుమ వర్ణము, నలుపు వర్ణము గల మచ్చలుంటాయి. ఒక శుభకార్యంలో అనగా వివాహాదులలో పెండ్లికుమార్తెకు, పెండ్లి కుమారునకు చంటి పిల్లలకు దిష్టితగల కుండా బుగ్గకు చుక్క పెట్టెదరు. ఆ చుక్క ఎందుకనగా వివాహమునకు అనేకమంది విచ్చేయుదురు. కాబట్టి దిష్టి దోష పరిహారార్ధమై మచ్చ పెట్టెదరు. అలాగునే శరీరం మీద తనంతట తానుగా వచ్చు మచ్చకు ఎంత ఫలితము ఉండునో మీకే ఎరుక, ఆ మచ్చలు అవయవం మీద వచ్చు మచ్చ ఫలితము ఈ విధంగా ఉండును.

ముక్కు – కోపము, వ్యాపారాభివృద్ధి, మంచి ఆలోచన, కుడికన్ను – అనుకూలమగు భార్య లభించుట, ఎడమకన్ను స్వార్జితమైన ధనము సంపాదించుట, నుదుట –మంచి మేధావి, ఐశ్వర్యవంతుడు, గెడ్డం – విశేష ధనయోగము కంఠము మధురమైన సుస్వరము ఆకస్మిక ధనలాభములు, మెడ – అత్తవారి ద్వారా ధనలాభం. మోచేయి– వ్యవసాయ అభివృద్ధి, కుడిచేయి మణికట్టు – ఆభరణ లాభములు, పొట్ట– భోజనప్రియులు, పొట్ట క్రింద అనారోగ్యం, కుడిభుజం– ఎదుటవారికి ఉపయోగపడుట, ఎడమభుజము శతృత్వము పెరుగుట, బొడ్డు లోపల – ధనలాభము, కుడి తొడ – ఐశ్వర్యవంతుడు స్త్రీలోలత, ఎడమతొడ – విశేష భోగములు, ధన నష్టములు, కుడిచేతి వ్రేళ్ళ యందు పైభాగమున – స్వతంత్ర విద్య, వ్యాపారము, ఎడమ చేతివ్రేళ్ళ యందు ధననష్టం, అపకీర్తి, అరచేతియందు – అనారోగ్యములు, అపవాదులు కుడి హృదయము – మంచి ఆకర్షణ శక్తి, ఎడమ హృదయము – అనారోగ్యములు. కుడి మోకాలు వాహనలాభము, ఎడమ మోకాలు – ప్రమాదములు, పాదము – ప్రయాణ లాభములు మర్మస్తానమున – కష్టసుఖములు సమానముగా ఉండుట. వీపు – కుటుంబ కలహములు కలుగుచుండును. స్త్రీలకు ఎడమవైపు వచ్చు మచ్చలు శుభప్రదమగును. పురుషులకు కుడివైపు వచ్చు మచ్చలు అనుకూలంగా ఉండును. మచ్చ యొక్క ఫలితము ప్రతి 7 మాసములకు మారుచుండును. వీటికి వ్యతిరేకంగా వచ్చు మచ్చలకు తగిన రీతిలో శాంతి జరిపించుకోవలెను.

## స్వప్న విశేషములు

ఇష్టదేవతను చూచుట, పసుపు, కుంకుమ, మంగళకరమగు కార్యక్రమములు చూచుట, పుష్పములు, పండ్లుకోయుట, వాహనములు, గుర్రములు, ఏనుగులు, రక్తము చూచుట, పరస్త్రీని సంభోగించినట్లు వచ్చుట, తినుబండారములు మన చేతికందుట, పసుపు పచ్చని వనములు కనిపించుట, స్నేహితులతో కలసి ప్రయాణించుట, తాను ఒక బాధకు గురియగునట్లు వచ్చుట, వేదఘోష వినిపించుట, పితృదేవతలు కనిపించుట ఇవి శుభమైనవి.

| వధూ నక్షత్రం | మీ అమ్మాయికి సరిపోయే వరుడు నక్షత్రములు |
|---|---|
| అశ్విని | అశ్వి. భర. కృ. రో. మృ. పు. ఆశ్లే. మ. పుబ్బ. చిత్త 3.4 అనూ. పుషా. ఉషా. శ్ర. ధ. ఉ.భా. రే |
| భరణి | అశ్వి. భర. కృ. రో. మృ3.4,ఆ. పున. ఆశ్లే. మ. పుబ్బ. ఉత్త1.స్వా. విశా. జ్యే. మూ. పూ.షా. ఉ.షా. శ్ర. రే. |
| కృత్తిక1 | అశ్వ. భర. మృ. 3.4. ఆ. పున. పు. పుబ్బ. ఉ.1. చిత్ర 3.4 అనూ. మూ. ధ. శత. పూ.భా 1.2.3. ఉ.భా |
| కృత్తి. 2.3.4. | అశ్వ. భర. రో. మృ 1.2. పున. పు. మఖ పుబ్బ. ఉ. హస్త. చిత్త. అనూ. జ్యే. ధని. శత. పూ.భా. ఉ.భా |
| రోహిణి | భర. కృత్తి.2.3.4. రో. మృ. ఆ. పున. పు. పుబ్బ. ఉ. హ. చిత్త. అనూ. జ్యే. శ్ర. ధని. శత. పూ.భ ఉ.భా. రే |
| మృగ 1.2 | అశ్వి. కృ 2.3.4. రో. ఆ. పున. పు. ఆశ్లే. మ. ఉ. హ. స్వా. విశా4. అనూ. జ్యే. శ్ర. ధని 3.4. శత. పూ.భా. రే |
| మృగ 3,4 | అశ్వి. కృ రో. ఆ. పున. మ. ఉత్త. హ. చిత్త 1,2, స్వా. విశా. 1,2,3, మూ. శ్ర. శత. పూ.భా. రేవతి |
| ఆర్ద్ర | అశ్వి. భర. రో. మృ. ఆ. పున.1,2,3, పుష్య. మ. పు. హ. చి. స్వా. వి.1,2,3, పూ.షా. ధ.3,4, పూ.భా.4 ఉ.భా. రే |
| పున1,2,3 | అశ్వి. భర. కృ. మృ. ఆ. పుష్య. ఉ. చిత్త. స్వా. వి.1,2,3, పూ.షా. పూ.భా.4, ఉ.భా. రే |
| పున 4 | అశ్వి. భర. కృ. మృ. పుష్య. ఆశ్లే. ఉ.2,3,4, చిత్త. స్వా. విశాఖ. అనూ. పూ.షా. ధని 1,2, ఉ.భా. రే |
| పుష్యమి | అశ్వి. భర. కృ. రో. ఆ. పున. పుష్య. ఆశ్లే. మఖ. ఉ. హ. స్వా. వి. అనూ. జ్యే. ఉ.షా. పూ.భా.4 ఉ.భా. రే |
| ఆశ్లేష | అశ్వి. భర. కృ. మృ.1,2, పున.4, పుష్య. ఆశ్లే. ఉత్తర2,3,4 హ. చి. అనూ. జ్యే.ధని.1,2, పూ.భా 4 ఉ.భా |
| మఖ | అశ్వి. భర. కృ 2,3,4, మృ. ఆ. పుష్య. మఖ. పుబ్బ. ఉత్త. చిత్త, అనూ. జ్యే. మూల. పూ.షా. ధని 3,4, శ. ఉ.భా |
| పుబ్బ | అశ్వి. భర. కృ. రో. మృ.3,4, ఆ. మఖ. పు. ఉత్త. హ. స్వా. విశా. జ్యే. మూల. పూ.షా. ఉ.షా.1, శత. పూ.భా. రే |
| ఉత్తర1 | అశ్వి, భర, కృ. రో. మృ. ఆ. పున.1,2,3, పుష్య. మఖ. పుబ్బ. స్వాతి. అనూ. పూ.షా. ఉ.షా1, ధ. 3,4, ఉ.భా |
| ఉత్త 2,3,4 | భర. కృ2,3,4, రో. మృ. ఆ. పున. పుష్య. పుబ్బ. హ. స్వా. అనూ. పూ.షా. ఉ.షా. శ్రవ. ఉ.భా. |
| హస్త | భర. కృ2,3,4, రో. మృ. ఆ. పున. పుష్య. ఆశ్లే. పుబ్బ. ఉత్త2,3,4, చిత్త. స్వా. విశా. అనూ.పూ.షా. ఉ.షా. శ్ర. ధ పూ.భా.4 ఉ.భా. రే. |
| చిత్త 1,2 | కృ. రో. మృ.3,4, ఆ. పున. ఆశ్లే. మఖ. హ. స్వా. వి. జ్యే. మూ. శ్ర. ధని. శత. పూ.భా. రే |

| | |
|---|---|
| చిత్త 3,4 | అశ్వి. కృ. రోహి. ఆ. పున. ఆశ్లే. మఖ. హ. స్వా. వి. జ్యే. మూల. ఉ.షా. శ్ర. ధని. శత. పూ.భా. 1,2,3 |
| స్వాతి | భర. మృ. ఆ. పున. పుష్య. పుబ్బ. హ. చిత్త. స్వా విశాఖ 1,2,3, అనూ. జ్యే. మూల. పూ.షా. శ్రవ. ధని. పూ.భా1,2,3, |
| విశాఖ 1,2,3 | అశ్వి. భర. మృ. ఆ, పున. పుష్య. ఆశ్లే. పుబ్బ. చిత్ర, స్వా. విశా. జ్యే. మూల. పూ.షా. ధని. శ. పూ.భా 1,2,3 |
| విశాఖ 4 | మృ 1,2, పున. 4, పుష్య, మఖ, పుబ్బ, చిత్త, విశా. అనూ. జ్యే. మూల. ధని. శత. పూ.భా |
| అనూరాధ | అశ్వి. కృ. రోహి. పున, పుష్య. ఆశ్లే. మ. పుబ్బ, ఉత్త. హ. స్వా. విశా. జ్యే. ఉ.షా. శ్ర. శత. పూ.భా. ఉ.భా. రే |
| జ్యేష్ఠ | భ. కృ. రోహి. మృగ 1,2, పుష్య. ఆశ్లే. మఖ, పుబ్బ, చి. విశా. అనూ. ఉ.షా. 2,3,4, శ్ర. ధని. ఉ.భా. రే. |
| మూల | భ. కృ. మృగ 3,4, మఖ. పుబ్బ. చి. స్వా. మూ. పూ.షా. ఉ.షా. 1. ధని. శత. ఉ.భా. రే |
| పూ॥షాఢ | అశ్వి. భర. రోహి. మృగ. 3,4, ఆ. పున. మఖ. పుబ్బ. ఉత్త. హస్త. స్వా. విశా. జ్యే. మూ. ఉ.షా. శ్ర. శత. పూ.భా. రే |
| ఉ॥షాఢ 1 | అశ్వి. భర. ఆ. పుష్య. పుబ్బ. ఉత్త. హ. చిత్త. స్వా. అనూ. మూల. పూ.షా. ధని3,4, శత. పూ.భా. ఉ.భా. |
| ఉ॥షాఢ 2,3,4 | అశ్వి. భర. ఆ. పుష్య, పుబ్బ. ఉత్త. హ. చిత్త. 3,4, స్వా. అనూ. పూ.షా. శ్ర. ధని. 1,2, పూ.భా. ఉ.భా. |
| శ్రవణం | భర. మృ. పున. పుబ్బ. ఉత్త. హ. చిత్త. స్వా. అనూ. జ్యే. పూ.షా. ఉ.షా. 2,3,4, శ్ర. ధని. శత. పూ.భా. ఉ.భా. రే. |
| ధనిష్ట 1,2, | అశ్వి. కృ. రోహి. పున4, ఆశ్లే. మఖ. హ. చిత్త3,4, స్వా. విశా. జ్యే. మూ. ఉ.షా. 2,3,4, శ్ర. శత. పూ.భా. |
| ధనిష్ట 3,4, | అశ్వి. కృ. రోహి. మృ. 1,2, ఆ. పున1,2,3, ఆశ్లే. మఖ. హ. చిత్త. స్వా. విశా. జ్యే. మూ. ఉ.షా. 2,3,4, శ్ర. శత. పూ.భా |
| శతభిషం | భర. రోహి. మృ. ఆ. మఖ. పు. చిత్త. విశా. అనూ. జ్యే. మూల. పూ.షా. శ్ర. ధని. శతబిషం పూ.భా. 1,2,3, |
| పూ.భా. 1,2,3 | అశ్వి. కృ. మృ. మఖ. పుబ్బ. చిత్త. స్వా. విశా. అనూ. పూ.షా. ఉ.షా. ధని. శత. పూ.భా. ఉ.భా. |
| పూ.భా. 4 | కృ. 2,3,4, మృ. ఆ. పున. పుష్య. ఆశ్లే. పుబ్బ. చిత్త 1,2, స్వా.విశా. అనూ. పూ.షా. ఉ.షా. ధని 1,2, పూ.భా. 4, ఉ.భా. |
| ఉ.భా. | అశ్వి. కృ. రోహి. ఆ. పున. పుష్య. ఆశ్లే. ఉత్త. హస్త. స్వా. అనూ. జ్యే. మూల. పూ.షా. ఉ.షా. శ్ర. పూ.భా. రే |
| రేవతి | అశ్వి. భర. మృగ. పున. పుష్య. పుబ్బ. ఉ. హస్త. చిత్త. 1,2, అనూ. జ్యే. మూల. పూ.షా. ఉ.షా. శ్ర. ఉ.భా. రే |

పై పట్టికలో విరోధ జంతువులు, చేయకూడని ఏకనక్షత్రములు, గుణమేళన చక్రములో 18 కంటే తక్కువ వచ్చినవి, నైధన తారలు, శతృషష్టాష్టకములు,వైరనక్షత్రములు వదలి మిగిలిన నక్షత్రములు, సూచించినాము. ఇంకనూ జాతకాదులను బట్టి, గ్రహమైత్రి, స్త్రీ దీర్ఘము, కుజదోషములు, ఇతర అంశములు గమనించుకొనవలెను.

# వధూవర గుణమేళన చక్రం

బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటమి, వైశ్యులకు స్త్రీ దీర్ఘము, శూద్రులకు యోని పొంతనములు శుభయుక్తముగా యుండి 18 గుణములు పైన వచ్చిన వధూవరులకు వివాహము చేయుట అధిక శుభప్రదము, విజయప్రదము

| వధూ నక్షత్రం | అశ్వి | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆ | పున 3 | పున 1 | పు | ఆ | మ | పు | ఉఫ 1 | ఉఫ 3 | హ | చి 2 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 13 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 |
| కృత్తిక 1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక 3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగశిర | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగశిర 2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆరుద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పునర్వసు 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 |
| పునర్వసు 1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 |
| పుష్య | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 22 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 |
| ఉత్తర 1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 |
| ఉత్తర 3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 |
| చిత్త 2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 |
| విశాఖ 1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 |
| అనూ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 |
| పూ॥షా | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉ॥షా 1 | 25 | 27 | 14 | 8 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 27 | 28 | 28 | 27 | 20 |
| ఉ॥ షా 3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 24 | 18 |
| ధనిష్ఠ 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 |
| పూ॥భా 3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 |
| పూ॥భా 1 | 14 | 21 | 26 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉ॥ భా | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 20 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

# వధూవర గుణమేళన చక్రం

బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటమి, వైశ్యులకు స్త్రీ దీర్ఘము, శూద్రులకు యోని పొంతనములు శుభయుక్తముగా యుండి 18 గుణములు పైన వచ్చిన వధూవరులకు వివాహము చేయుట అధిక శుభప్రదము, విజయప్రదము

| వరుడు నక్ష→ వధువు నక్ష↓ | చి 2 | స్వా | వి 3 | వి 1 | అనూ | జ్యే | మూ | పూ | ఉషా | ఉషా 3 | శ్ర | ధ 2 | ధ 2 | శత | పూ॥భా | పూ॥భా | ఉ॥భా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 21 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| కృత్తిక 1 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తిక 3 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగశిర | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగశిర 2 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆరుద్ర | 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| పునర్వసు 3 | 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పునర్వసు 1 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| పుష్య | 11 | 26 | 21 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్లేష | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఖ | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పుబ్బ | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉత్తర 1 | 17 | 26 | 17 | 24 | 30 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉత్తర 3 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 19 | 26 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| చిత్త 2 | 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త 2 | 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| స్వాతి | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 20 | 20 | 13 |
| విశాఖ 3 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| విశాఖ 1 | 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| అనూ | 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| మూల | 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| పూ॥షా | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉ॥షా 1 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉ॥షా 3 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| శ్రవణం | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ఠ 2 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ 2 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| శతభిషం | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| పూ॥భా 3 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూ॥భా 1 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| ఉ॥ భా | 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 30 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

## వ్యవసాయ విషయములు



**1. క్రొత్తభూమిలో ప్రవేశించుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, బుధ గురు, శుక్రవారములు. అశ్విని, పుష్యమి, చిత్ర, మృగశిర, అనూరాధ, రోహిణి, ఉత్తర, స్వాతి, మూల, మఖ, ధనిష్ట, శ్రవణం, శతభిష నక్షత్రములు మంచివి.

**2. పశుశాల వేయుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు. సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు శుభలగ్నాలు, శుభప్రదం.

**3. పశువులు కొనుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, మృగశిర, మఖ, పున, పుష్య, ఉత్తర, విశాఖ, జ్యేష్ట, పూర్వాషాఢ, ధనిష్ట, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రములు శుభమైనవి.

**4. పశువులు అమ్ముటకు :** 2,3,5,7,10,11,13 తిథులు. ఆది, సోమ, బుధ, గురువారములు. అశ్విని, మృగశిర, పున, పుష్య, పూర్వాభాద్ర, రేవతి నక్షత్రములుశుభం.

**5. దుక్కి దున్నుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, మంగళ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములందును, వృషభ, మిధున, కన్యా, ధనస్సు, వృశ్చిక, మీన లగ్నములందు దుక్కిదున్నుట శుభము.

**6. విత్తనములు చల్లుట :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, మంగళ, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందును. వృషభ, మిధున, కన్యా, ధనస్సు, వృశ్చిక, మీన లగ్నములు శుభదాయకం.

**7. వరి ఆకు ఊడ్చుటకు :** 2, 3, 4, 5, 7, 9, 10, 11, 13, 14 తిథులు. ఆది మంగళ, శుక్రవారములు. అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, రేవతి నక్షత్రములలోను వృషభ, మిధున, కన్యా, ధనస్సు, వృశ్చిక, మీన లగ్నములు వరి కోయుటకు శుభప్రదం.

**8. అరటి, మామిడితోటలు వేయుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, మంగళ,శుక్రవారములు, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు. వృషభ, మిధున, కన్య, వృశ్చిక, ధనస్సు, మీనలగ్నములు మంచివి.

**9. చెఱకు తోట వేయుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, మంగళ, గురు వారములు స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు. వృషభ, మిధున, కన్య, వృశ్చిక, ధనస్సు, మీన లగ్నములు శ్రేష్టమైనవి.

**10. క్రొత్త ధాన్యం కాటా వేయుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13, తిథులు. ఆది, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభదాయకం.

**11. చెఱువులు త్రవ్వుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు, ఆది, సోమ, బుధ, గురు శుక్రవారములు. అశ్విని రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు మంచివి.

**12. చెఱువుకు నీరుపెట్టుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభప్రదమైనవి.

**13. పడవ నీటిలో దింపుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, సోమ, బుధ, గురు శుక్రవారములు. అశ్విని రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభప్రదమైనవి.

**14. వల నీటిలోతడుపుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13, 15 తిథులు. సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభప్రదమైనవి.

**15. చేపపిల్లలు చెఱువులో వేయుటకు :** 2, 3, 5, 7, 10, 11, 13 తిథులు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు శుభప్రదమైనవి.

## వ్యాపార విషయములు

**1. బట్టలు వ్యాపారమునకు :** 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు, శుభలగ్నములు శుభప్రదమైనవి.

**2. వెండి, బంగారు వ్యాపారములకు :** 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు. శుభలగ్నములు శుభప్రదమైనవి.

**3. చిట్‌ఫండ్స్ ఫైనాన్సు వ్యాపారములకు :** 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు. సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు. శుభలగ్నములు శుభప్రదం.

**4. పుస్తకములు, స్టేషనరీ వ్యాపారములకు :** 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు. సోమ, బుధ, గురు, శుక్రవారములు. అశ్విని, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి, నక్షత్రములు. శుభలగ్నములు శుభప్రదం.

